అపరాధ పరిశోధన అనుబంధం—38

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## విషం తినే మనుషులు!

రచన : అజీజ్

## ఘరానా హంతకుడు

రచన : వసుంధర

## దోపిడి దొంగలు

రచన : యం. కె. వి. శాస్త్రి

## "వీరాభిమన్యు"

రచన : శశిభూషణ్

'శాన్యోరా' సీరియల్-మూడవభాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—38
ఫిబ్రవరి, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# విషం తినే మనుషులు!

అజీజ్

సిగరెట్ అంటించి, ఆ కేసు గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను నా ఆఫీసులో.

గడచిన ఐదురోజులనించీ మద్రాసు నగరంలో రెండు విచిత్రమైన హత్యలు జరిగేయి. ఆ హత్యలు ఇటు పోలీస్ డిపార్ట్‌మెంట్‌లోనూ, అటు పత్రికల్లోనూ, ప్రజల్లోనూ తీవ్ర సంచలనం లేవదీసేయి.

ఆ కేసు తక్షణం క్రైం బ్రాంచికి, అంటే నాకు అప్పగించబడింది. ఐదురోజుల్నించీ నిద్రాహారాలు మాని ప్రయత్నిస్తున్నాను. ఐనా, హంతకుని ఆచూకీ దొరకడంలేదు. అంతేకాదు, ఆ హత్యలకి కారణాలుకూడా స్పష్టంగా తెలీడంలేదు.

చంపబడ్డ ఇద్దరూ అందమైన యువతులు!

ఐదురోజుల క్రితం శాంథోం బీచి ప్రాంతంలో ఓ శవం కనిపించింది. పాతికేళ్ళ అందమైన యువతి శవం. ఆమె రెండు కళ్ళూ పీకెయ్యబడ్డాయి. కళ్ళు ఉండవలసినచోట రెండు వికృతమైన గుంటలు! గొంతు నులిమి చంపబడిందని డాక్టర్ చెప్పేడు.

ఆరా తియ్యగా, ఆ యువతి పేరు పూర్ణిమ అనీ, పడుపువృత్తిజేసుకు బ్రతికేదనీ, చీకటిపడగానే అందంగా తయారై పార్కుల్లోనో, బీచిల్లోనో, క్లబ్బుల్లోనో రోజూ ఎవ్వరో ఒకర్ని వల్లోవేసుకుని హోటళ్ళల్లో గడిపేదనీ తెలిసింది.

ఆ రాత్రికూడా ఆమెని శాంథోం బీచి ప్రాంతంలో ఓ మగాడివెంట, ఇద్దరు ముగ్గురు చూడ్డం జరిగింది. అంటే, అంతకిమించి మరేం తేలలేదు.

ఇలాగే, విశాలాక్షి అనబడే ఓ పాతికేళ్ళ విద్యార్థిని హత్య జరిగింది. సాయంత్రం ఏడుగంటల ప్రాంతంలో తన స్నేహితురాలి దగ్గిర బయోలజీ నోట్స్ పట్టుకొస్తానని చెప్పి వెళ్ళింది విశాలాక్షి. అంతే, ఉదయం విక్టోరియా పార్కులో బెంచిమీద ఆమె శవం కనిపించింది.

ఆ శవానికి కళ్ళు లేవు!

ఆమెకూడా గొంతు నులిమి చంపబడింది. పై రెండు హత్యాప్రదేశాల్లోనూ హంతకునికి సంబంధించిన ఎలాటి ఆధారాలూ కనిపించలేదు. విచిత్రం ఏమిటంటే, మరణించక ముందు వారితో ఎలాటి బలాత్కారం, అంటే మానభంగం జరపబడలేదు.

శవాల ఒంటిమీద ఎలాటి గాయాలూ లేవు. నా పరి

శోధనలో తేలిన ముఖ్య విషయం మరణించిన ఇద్దరివీ ఎంతో అందమైన కళ్ళు! శవాల గొంతుల చుట్టూ ఎలాంటి వేలిముద్రలు దొరకలేదు. హంతకుడు గ్లౌస్ తొడుక్కొని జాగ్రత్త పడుంటాడు.

శవాల కళ్ళు తీసిన తీరునిబట్టి, ఆ కళ్ళను ఎంతో జాగ్రత్తగా ఆపరేట్ జేసి తీసినట్టు తేలింది. ఒక డాక్టర్ తప్ప, ఆ విధంగా మరొకరు తియ్యలేరని పోలీస్ డాక్టర్ల అభిప్రాయం. హంతకుడి విషయంలో మేము వేసుకున్న ఒకేఒక అంచనా ఇది. అతను డాక్టర్! శస్త్రచికిత్స తెలిసిన మంచి ఆప్తామాలజిస్ట్!

ఎవ్వరతను? మద్రాసు మహానగరంలో వేలసంఖ్యలో ఉన్న డాక్టర్లలో ఎవ్వరని పసిగట్టేది? అందమైన కళ్ళ కోసం నిండు ప్రాణాలను బలిగొంటున్న అతను పిచ్చి వాడా? ఏ ఉద్దేశంతో కళ్ళు కాజేస్తున్నాడు?

ఇద్దరితోనే సరిపెడతాడా? లేక, మరిన్ని హత్యలు జేస్తాడా? ఇవి సైకో.మర్డర్సా? ఏ స్త్రీ వల్లనో మనసు గాయపడి మతి స్థిమితంలేని మానసికరోగి జేస్తున్న హత్యలా?

ఇదే నిజమైతే ఆ వ్యక్తికి అందమైన కళ్ళుగల ప్రతి స్త్రీపట్లా విపరీతమైన ద్వేషం నిండివుంటుంది.

నా ఆలోచనాసరళిని తుంచివేస్తూ టేబిల్‌మీది ఫోన్ మోగింది. రిసీవర్ అందుకుని, "ఎస్! ఇన్‌స్పెక్టర్ రాజా రెడ్డి స్పీకింగ్!" అన్నాను.

"నేను అడయార్ పోలీస్ సబిన్‌స్పెక్టర్ని సార్!"

"ఏమిటి?"

"మరో హత్య జరిగింది!"

"ఎక్కడ?"

"అడయార్ లేబర్ కాలనీ దగ్గర, కొత్తగా ఓ బిల్డింగ్ కడుతున్నారు. ఆ బిల్డింగ్ కాంపౌండ్‌లో పడుంది శవం!"

"అందమైన అమ్మాయిదేనా?"

"నో. నో! పాతికేళ్ళ యువకుడిది!"

"ఇప్పుడే వస్తున్నాను" అని రిసీవర్ దించి లేస్తూ టైం చూసుకున్నాను.

ఉదయం ఏడున్నర!

నా అసిస్టెంట్, సార్జంట్ డేవిడ్‌తో జీప్ ఎక్కాను.

# 2

ఆ బిల్డింగ్ చుట్టూ కాలనీ జనం మూగివున్నారు. కాంపౌండ్‌లో జీప్ ఆపి దిగేను. ఇంకా కట్టబడుతున్న బిల్డింగ్ అది. కాంపౌండ్‌లో అక్కడక్కడా కాంక్రీటూ, రాళ్ళూ, ఇటికెలూ కుప్పలుగా పడున్నాయి.

మమ్మల్ని చూడగానే అడయార్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ సెల్యూట్ కొట్టి, శవం పడున్నచోటికి తీసికెళ్ళేడు.

కాంపౌండ్‌లో ఓ మూల వెల్లకిలా పడుంది శవం.

శవాన్ని చూసి నివ్వెరబోయేను.

అది కళ్ళు లేని శవం!

గతంలో జరిగిన హత్యలకీ, ఈ హత్యకీ లింకు వుందని స్పష్టమైంది. హంతకుడు అందమైన ఆడవాళ్ళనే చంపుతున్నాడనుకున్న నా అంచనా, దీనితో తారుమారయింది.

ఆలోచిస్తూ శవాన్ని పరీక్షగా చూసేను. ఎర్రగా, బుర్రగా వున్న పాతికేళ్ళ యువకుడు. ఖరీదైన బెల్ బాటమ్ సూటు. కాళ్ళకి బూట్సు. మెడలో బంగారు గొలుసు. ఎవ్వరో ధనిక కుటుంబానికి చెందినవాడై వుంటాడు.

"శవం ఇక్కడుందని మీకెలా తెలిసింది?" అడిగేను సబిన్స్పెక్టర్ని.

"ఇక్కడ పనిజేసే ఓ కూలీ, ఉదయం ఏడుగంటలకి వచ్చి చూసి పరిగెత్తికెళ్ళి కాలనీవాళ్ళని పిల్చుకువచ్చేడు. వాళ్ళే మాకు ఫోన్ జేసి చెప్పేరు."

"ఆ కూలీ ఇక్కడే వున్నాడా?"

ఇన్స్పెక్టర్ తలూపి, కానిస్టేబుల్కు సైగ చేసేడు.

కూలీ రాగానే, "ఈ బిల్డింగ్ ఎవరు కట్టిస్తున్నారు?" అడిగేను.

"తీర్థనాథ్ గారండి!"

"ఎక్కడుంటాడాయన?"

"తెలీదండి. మూర్ మార్కెట్లో ఆళ్ళకి పెద్ద వెండి, బంగారం దుకాణ ముందండి."

"నీవు శవాన్ని పరీక్షగా చూసేవా?"

"లేదండి. కాంపౌండ్లోకి రాగానే, మూలపడున్న శవం కనిపించిందండి. భయమేసి కాల్నీలోకి పరిగెత్తేనండి."

"సరే, శవాన్ని కాస్త పరీక్షగా చూసి చెప్పు. అతన్నెప్పుడైనా, ఎక్కడైనా చూశావేమో!" అన్నాను.

కూలీ శవాన్ని చూసేడు.

గుడ్లు తేలవేసి అలా చూస్తూ వుండిపోయేడు.

"గుర్తు పట్టేవా?" అడిగేను కుతూహలంగా.

"ఔనండి! ఈన ప్రసాదుబాబుగారండి" అన్నాడు వణికే కంఠంతో.

"ఏ ప్రసాద్ బాబు?"

"తెలీదండి. ఒకటి రెండుసార్లు మా యజమానిగా రెంట ఈడికొస్తే చూసేను."

"ఒంటరిగా వచ్చేవాడు కాదా?"

కూలీ క్షణం ఆలోచించి, "ఓమారు ఓ అమ్మాయి వెంట కూడా వచ్చినట్టు జ్ఞాపకమండి" అన్నాడు.

"ఎవరా అమ్మాయి?"

"తెలీదండి!"

"మీ యజమాని తీర్థనాథ్‌కీ, ఇతనికీ ఏదైనా బంధుత్వమా?"

"ఈడ కూలిజేసుకు బ్రతికేవాళ్ళం. అవన్నీ మాకెట్టా తెలుస్తాయి బాబూ?"

ఇంకా ఏదో అడగబోతున్నాను. అదే సమయంలో ఓ కారు కాంపౌండ్‌లోకి ప్రవేశించడంతో ఆగి, అటు చూసేను. డ్రైవింగ్ సీట్లోంచి ఫుల్ సూట్‌లో వున్న ఓ యువకుడు దిగి అడుగులో అడుగు వేసుకుంటూ మమ్మల్ని సమీపించేడు.

ఓసారి అందర్నీ పరికించి, "గుడ్ మార్నింగ్ ఇన్‌స్పెక్టర్! నా పేరు తీర్థనాథ్!" అన్నాడు చాలా నింపాదిగా.

తలూపి, "గ్లాడ్ టు మీట్ యూ! నేనే మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నాను. ఈ బిల్డింగ్ మీరే కట్టిస్తున్నారు కదూ?" అడిగేను.

అతను తలూపి, కింద పడున్న శవాన్ని చూడసాగేడు.

"ఈ యువకుడు ఎవరో మీకు తెలుసా?" అడిగేను అతన్ని పరీక్షగా చూస్తూ.

తీర్థనాథ్ మెల్లిగా తలెత్తి, "తెలుసు! ఇతను నా ప్రైవేట్ సెక్రెటరీ ప్రసాదరావ్!" అన్నాడు.

తన సెక్రెటరీ, అంత దయనీయంగా చచ్చిపడుండటం కళ్ళారాచూస్తున్నా అతని మొహంలో ఎలాటి భావాలూ లేకపోడం నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది.

"మిస్టర్ తీర్థనాథ్! మీ సెక్రెటరీ ఇక్కడ చచ్చి పడున్నాడని మీకు ముందే తెలుసా?" అడిగేను అతని కళ్ళల్లోకి చూస్తూ. తీర్థనాథ్ తలూపి, "తెలుసు!" అన్నాడు ముక్తసరిగా.

"ఎలా తెలుసు?"

"ఇప్పుడే, కారు కాంపౌండ్‌లోకి తిప్పుతుండగా, బైట నిల్చున్న కాలనీ జనంలో ఎవ్వరో చెప్పేరు!"

నిట్టూర్చేను. కొందరి తత్వం ఇంతే. మిన్ను విరిగి మీద పడ్డా తొణకరూ, బెణకరు.

"ప్రసాదరావ్ ఎన్నాళ్ళనించి మీ దగ్గిర పనిజేసే వాడు?"

"దాదాపు రెండేళ్ళనించి."

"అతను నిజంగా మీ ప్రైవేట్ సెక్రెటరీయేనా?" అడిగేను అనుమానంగా.

"ఔను. ఇందులో మీరు అనుమానించవలసిందేమీ లేదే!"

నవ్వేను. "మిస్టర్ తీర్థనాథ్! వెండి, బంగారు వ్యాపారులకి సైతం ప్రైవేట్ సెక్రెటరీల అవసరం వుంటుందని నాకిప్పుడే తెలిసింది."

తీర్థనాథ్ నవ్వి, "మీ అనుమానం సరైనదే. ఆ వ్యాపారంతో బాటు నాకు మరో రెండు మూడు వ్యాపారాలు వున్నాయి. ఒక్కణ్ణీ అవన్నీ చూసుకోలేక, ప్రసాదరావ్‌ని సెక్రెటరీగా పెట్టుకున్నాను" అన్నాడు.

"అతన్ని పెట్టుకోమని ఎవరైనా సిఫార్సు చేసేరా?"

"ఎవ్వరో సిఫార్సు చెయ్యడం ఏమిటి? అతను స్కూల్ ఫైనల్లో నా క్లాస్ మేట్. బాల్య స్నేహితుడు."

సిగరెట్ అంటించి, "ప్రసాదరావ్ ఎలాటివాడు?" అడిగేను.

"స్నేహపాత్రుడు. కష్టపడి పనిజేసేవాడు. బి. ఏ. పూర్తిజేసి నిరుద్యోగిగా తిరుగుతుంటే నేనే పిలిచి ఉద్యోగం ఇచ్చేను."

"మీరెంతవరకు చదువుకున్నారు?"

"ఎమ్. బి. బి. ఎస్!"

తీర్థనాథ్ అన్న ఈ మాటతో నాకు షాక్ తగిలినట్లు తోచింది. నా భావాలు వ్యక్తం కానివ్వకుండా, "డాక్టర్ డిగ్రీ పుచ్చుకున్న మీరు వైద్యరంగంలో ప్రవేశించకుండా, వ్యాపారం దేనికి చేపట్టేరు?" అడిగేను.

తీర్థనాథ్ నవ్వి, "నేను డాక్టర్ డిగ్రీ పుచ్చుకోలేదు. మూడో సంవత్సరం పూర్తిజేసి మానేసేను" అన్నాడు.

"ప్రసాదరావ్ కి పెళ్ళయిందా?" అడిగేను అసలు విషయానికి వస్తూ.

"ఇంకా కాలేదు. చేసుకునే ప్రయత్నాలు జేస్తున్నాడని తెలిసింది."

"అతను తరుచూ ఓ అమ్మాయి వెంట ఇక్కడికి వచ్చేవాడుట ఈ విషయం మీకు తెలుసా?"

"తెలుసు!"

"ఎలా?"

"ఆ అమ్మాయే స్వయంగా నాకు చెప్పింది!"

"అంటే, మీకూ ఆ అమ్మాయితో పరిచయం ఉందన్న మాట!"

"పరిచయం ఏమిటి? ఆమె నా అక్కయ్యే!" అన్నాడు తీర్థనాథ్ నింపాదిగా.

కాసేపు నానోట మాట పెగల్లేదు.

తిరిగి అతనే అన్నాడు: "ఆమె ప్రసాదరావుని విపరీతంగా ప్రేమించడం మొదలుపెట్టింది. పెళ్ళిజేసుకుంటే, అతన్నే జేసుకుంటానని నాతో చెప్పేది కూడా!"

"ఆ విషయంలో మీరేం నిర్ణయం తీసుకున్నారు?"

"ఇంకా ఏ నిర్ణయమూ తీసుకోలేదు. ఇంతలో ప్రసాదరావ్ ఇలా పోయేడు."

"ప్రసాదరావు వయసూ, మీ వయసూ దాదాపు ఒక్కటే అనిపిస్తోంది. అంటే, మీ అక్కయ్య ప్రసాదరావుకన్నా వయసులో పెద్దదన్నమాట?"

తీర్థనాథ్ తలూపి, "ఔను!" అన్నాడు.

"ఆమె పేరు తెలుసుకోవచ్చా?"

"రత్నరాశి!" అన్నాడు తీర్థనాథ్.

"ఆమె ఇప్పు డెక్కడుంది?"

"మా నాన్నగారి అంటే మా పాత ఇంట్లో!"

"మీ నాన్నగారు ఉన్నారా?"

"నో.నో! ఆయన గుండెజబ్బుతో హఠాత్తుగా పోవడం వల్లే నా చదువు పూర్తిచెయ్యకుండా ఆపి, వ్యాపారంలో దిగవలసి వచ్చింది. మా నాన్నకి నేనొక్కణ్ణే మగ సంతానం.

ఆయన చివరి రోజులు తాంబరంలో ఉన్న మా పాత ఇంట్లో గడిచేయి. ఆయన పోయేక, అక్కయ్య అందులో ఉంటోంది!"

"మీ బాల్య స్నేహితుడు, ప్రైవేట్ సెక్రటరీ,

కాబోయే బావ ఐన ప్రసాదరావు, ఇలా ఘోరంగా హత్య జెయ్యబడటం మీమీద ఎటువంటి ప్రభావం వేసింది?''

''దుఃఖాన్ని! భరించలేని దుఃఖాన్ని నింపివేసింది. మస్తిష్కం ఆలోచనారహితమైపోయిందంటే నమ్మండి. గుండెలో అగ్నిపర్వతాలు బ్రద్దలైనా, వాటిని వ్యక్తం జెయ్యకుండా పైకి చిరునవ్వు నవ్వడం నా అలవాటు'' అన్నాడు తీర్థనాథ్.

సాలోచనగా తలూపి ''మీ అక్కయ్య ఇప్పుడు ఇంట్లో ఉండి ఉంటారా?'' అడిగేను.

తీర్థనాథ్ తలూపేడు.

''నేను వెంటనే ఆమెని కలుసుకోవాలనుకుంటు న్నాను. మీరు నావెంట వస్తారా?''

అతను కాసేపు ఆలోచించి, ''సరే పదండి!''అన్నాడు.

అంబులెన్స్‌నీ, ఫోటోగ్రాఫర్లనీ పిలిపించి, అక్కడి తతంగం ముగించి, హెడ్ క్వార్టర్స్‌కి వెళ్ళిపొమ్మని డేవిడ్‌తో చెప్పి, తీర్థనాథ్ వెంట అతని కారువైపు నడిచేను.

# 3

పోర్టికోలో కారు ఆపేడు తీర్థనాథ్.

పాతకాలపు పద్ధతిలో కట్టబడిన మేడ అది.

కారు దిగి లోనికెళ్ళాం. హాల్లోంచి మెట్లగుండా మేడ మీదికి జేరుకున్నాం. రెండు మూడు గదులున్నాయి. అందులో ఓ గది తలుపు మూసి వుంది.

తీర్థనాథ్ ఆ గదిముందు నిల్చుని ''అక్కయ్యా!'' అని పిలిచేడు.

లోపలినించి జవాబులేదు.

"అక్కయ్యా!" మళ్ళీ పిలిచేడు తీర్థనాథ్.

నిశ్శబ్దం! అసలు గదిలో ఎవ్వరూ ఉన్న అలికిడిలేదు. తీర్థనాథ్ తలుపు తట్టడానికి చెయ్యి వెయ్యగానే, కిర్రు మంటూ తెరుచుకుంది రెక్క!

తలుపు పూర్తిగా తోసి లోనికెళ్ళాడు తీర్థనాథ్. నేను బైటే నిల్చున్నాను. అంతే! కెవ్వున గావుకేక వినిపించింది లోపలినించి.

అది తీర్థనాథ్ గొంతు.

ఒక్క ఉదుటున లోనికి దూరేను.

గదిలోని దృశ్యం చూడగానే నా రోమాలు నిక్క బొడుచుకున్నాయి. గోడవారగా వేసి వున్న పందిరి మంచం, మంచంమీద వెల్లికిలా పడున్న, పుష్టికరమైన, అందమైన యువతి శవం.

అది కళ్ళు లేని శవం!

విచిత్రం ఏమిటంటే, ఆమె పూర్తి నవ వధువు దుస్తుల్లో వుండటం. నుదుట కుంకుమ తిలకం, కాళ్ళకి పసుపూ పారాణీ, ఒంటిమీద నగలూ!

"మా అక్కయ్య రత్నరాశి ఆమే!" అన్నాడు తీర్థనాథ్ పూడుకుపోయిన కంఠంతో.

అతన్ని ఉరిమి చూస్తూ జేబులోంచి పిస్తోలు తీసేను.

"ఇన్‌స్పెక్టర్! ఏమిటిది?" అడిగేడు తీర్థనాథ్ ఆశ్చర్యంగా.

"మిస్టర్ తీర్థనాథ్! నీ అక్క, నెలసరి జీతంమీద నీ దగ్గిర పనిజేసే ప్రసాదరావుని ప్రేమించి పెళ్ళిజేసుకోవాలనుకుంది. అది ఇష్టంలేక, నయానో భయానో వాళ్ళిద్దరికీ నచ్చజెప్పి ఉంటావ్.

వయసులో నీకంటే పెద్దదైన రత్నరాశి, నిన్ను యెదిరించి వుంటుంది. ఎవ్వరి ప్రమేయం లేకుండా తనకి తానే, ప్రసాదరావుని పెళ్ళిజేసుకోడానికి నిశ్చయించి ఉంటుంది.

ఆ కోపం భరించలేక ఇద్దర్నీ చంపివుంటావ్. నగరంలో ఈమధ్య ఇద్దరు యువతుల హత్యలు జరిగేయి. గుర్తు తెలియని హంతకుడు వాళ్ళని చంపి, శవాల కళ్ళు పీక్కుపోతున్నాడు. ఈ హత్యలూ ఆ అనామక హంతకుడే జేసినట్టు మమ్మల్ని తప్పుదోవ పట్టించడానికి, ఈ యెత్తు వేసివుంటావ్. నిన్ను ఈ క్షణంలో అరెస్ట్ జేస్తున్నాను'' అన్నాను తీక్షణంగా. నా మాటలుగానీ, నా చేతిలోని పిస్తోలుగానీ, అతనిమీద ఎలాటి ప్రభావం వెయ్యలేదు.

''ఇన్‌స్పెక్టర్ మీరు పొరబడుతున్నారు. నాకీ హత్యలతో ఎలాటి సంబంధం లేదు. నేను అక్కయ్యని రెండు రోజుల క్రితం కలుసుకున్నాను. ఆమె ప్రసాదరావుని పెళ్ళిజేసుకోవాలనుకున్నా, ఏ పాపారావుని పెళ్ళిజేసుకోవాలనుకున్నా నా కెలాటి అభ్యంతరం లేదు.

కారణం, ఒకరి వ్యక్తిగత విషయాలలో నే నెప్పుడూ జోక్యం కల్పించుకోను. అలాగే, నా స్వంత విషయాలలో మరొకరి జోక్యాన్ని సహించను'' అని క్షణం ఆగి, నిట్టూరుస్తూ తిరిగి చెప్పసాగేడు.

''ఇప్పుడర్థమౌతోంది ఈ హత్యలు ఎందుకు జరిగేయో, ఎవ్వరు జేసి వుంటారో?'' అన్నాడు తీర్థనాథ్.

''ఎవ్వరు జేసివుంటారు? రత్నరాశిని ప్రేమించే వ్యక్తి ఇంకెవ్వరైనా ఉన్నాడా? ఆమె ప్రసాదరావుని పెళ్ళి జేసుకోడం ఇష్టంలేక, ఆమెకి తనమీద ఇష్టంలేదు గనుక,

కసితో ఇద్దర్నీ చంపేసేడా?'' అన్నాను అతన్ని పరీక్షగా చూస్తూ.

తీర్థనాథ్ తలూపేడు. "నాలాగే మీరూ సరిగ్గా ఊహించేరు ఇన్‌స్పెక్టర్! అక్కయ్యని ప్రేమించే మరో వ్యక్తి వున్నాడు. కేవలం ప్రేమించడం కాదు. పిచ్చిగా ఆరాధించేవాడు. ఒకసారి నాతో చెప్పేడు కూడా, అక్కయ్యని తను పెళ్ళిజేసుకుంటానని.''

"ఎవ్వరతను?''

"జీవన్! అతనెవ్వరో పరాయివాడు కాదు. వేలు విడిచిన మా మేనత్త కొడుకే!''

"ఇప్పుడెక్కడున్నాడు?''

"నా ఇంట్లోనే! వాళ్ళకి హైద్రాబాద్‌లో బట్టల వ్యాపారం వుంది. పనిమీద అప్పుడప్పుడూ మద్రాసు వస్తుంటాడు. వచ్చినప్పుడల్లా నా ఇంట్లోనే మకాం జేస్తాడు.''

నేను ఇంకేమీ అడగలేదు. గదిమూలవున్న టెలిఫోన్ని సమీపించి, తాంబరం పోలీసులకి రింగ్ జేసి, కావలసిన సిబ్బందితో తక్షణం ఆ ఇంటికి రమ్మని చెప్పేను.

తరవాత తీర్థనాథ్ వైపు తిరిగి, "మిస్టర్ తీర్థనాథ్ నేను వెంటనే జీవన్‌ని చూడాలనుకుంటున్నాను''అంటూ పిస్తోలు జేబులో వేసుకున్నాను.

తీర్థనాథ్ తలూపేడు.

పావుగంట తరవాత తాంబరం పోలీసులు వచ్చేరు.

వాళ్ళకి కావలసిన ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి, తీర్థనాథ్‌తో బైలుదేరేను.

# 4

తన ఇంటి పోర్టికోలో కారు ఆపేడు త్రినాథ్.

మెట్లు తుడుస్తున్న నౌఖర్ని పిలిచి, "జీవన్ వున్నాడా ఇంట్లో?" అడిగేడు.

"అరగంట క్రితమే బైటనించి వచ్చేరండి. ఆరి గది లోనే వుండివుంటారు" అన్నాడు నౌఖరు.

తీర్థనాథ్ నావైపు తిరిగి, "రండి ఇన్స్పెక్టర్!" అన్నాడు.

అతన్ని అనుసరిస్తూ హాల్లో అడుగుపెట్టి, మెట్లగుండా పైకి జేరుకున్నాను. తలుపు తెరిచివున్న ఓ గదిలోకి నడుస్తూ, "రండి ఇన్స్పెక్టర్!" అన్నాడు తీర్థనాథ్.

అతని వెనకే గదిలో అడుగుపెట్టేను.

లోపల ఎవ్వరూ లేరు!

కాని, టీపాయ్‌మీది ఏష్‌ట్రేలో కాలుతున్న సిగరెట్ పీక కనిపించింది.

"బాత్‌రూం వెళ్ళుంటాడు. కూర్చోండి!" అన్నాడు తీర్థనాథ్.

ఐదు నిమిషాలు ఓపిగ్గా కూర్చున్నాం. ఏష్‌ట్రేమీది సిగరెట్ కూడా ఆరిపోయింది. కాని, ఎవ్వరూ రాలేదు.

బాత్‌రూం తలుపు మూసివుంది. లోపల నీళ్ళ శబ్దం గానీ, మరేశబ్దంగానీ వినిపించడంలేదు.

"ఇంతసేపూ ఏంజేస్తున్నాడబ్బా?" అంటూ బాత్‌రూం వైపు నడిచేడు తీర్థనాథ్.

బాత్‌రూం తలుపు దగ్గిర ఆగి, "జీవన్!" అంటూ తలుపు తట్టేడు.

అతని చెయ్యి పడగానే చిన్న శబ్దంజేస్తూ తలుపు

తెరుచుకుంది.

తీర్థనాథ్ లోనికెళ్ళి కెవ్వుమన్నాడు.

నా గుండె గుభిల్లుమంది. మెరుపులా అక్కడికి చేరు కున్నాను.

నేలమీద వెల్లికిలా పడుంది శవం! అందమైన, ఆకర్షణీయమైన యువకుడి శవం. కళ్ళు ఉండవలసినచోట రెండు గుంటలు. ఆ గుంటల్లోంచి ఉబికి, కణతలమీద ధారలుగా కారిన రక్తం! గంట క్రింత సజీవంగా ఉన్న వ్యక్తి ఇతనేనా అనిపించింది. బాత్‌రూంలోంచి పెరట్లోకి మరో తలుపుంది. అది దగ్గరగా వేసుంది.

తీర్థనాథ్‌ని భుజం పట్టుకుని బైటికి తీసికెళ్ళేను. అతను ఎక్సైట్‌మెంట్‌కి గురయ్యేడు. ఫిట్స్ వచ్చినట్టు వణుకుతున్నాడు. ఈ మూడు హత్యలతో అతనికి సంబంధం లేదని తేలిపోయింది. కారణం, అరగంట క్రితం జీవన్ బైటినించి ఇంటికి వచ్చినట్టు చెప్పేడు నౌఖరు. కాని, తీర్థనాథ్ రెండు గంటలనించీ నా వెంటే వున్నాడు.

"మిస్టర్ తీర్థనాథ్! ఎక్సైట్‌మెంట్‌కి గురి కాకండి. ఈ సమయాల్లోనే ధైర్యం అవసరం. ఆ నౌఖర్ని పిలిపించండి" అన్నాను.

అతను వెళ్ళి అంత క్రితం పోర్టికోలో మాట్లాడిన నౌఖర్ని పిలుచుకొచ్చేడు.

"జీవన్ ఇంటికి వచ్చేక ఎలా కనిపించేడు?" అడిగేను.

"ఏదో తొందరలో వున్నట్టూ, ఖంగారుగా వున్నట్టూ పించేరండి. గేటు దగ్గర టాక్సీ దిగగానే హడావుడిగా లోనికి వచ్చి తన గదిలో కెళ్ళిపోయేరండి."

"అతను ఇంటికి వచ్చేక, ఎవ్వరైనా అతనికోసం

వచ్చేరా?''

"లేదండి. ఆయన రాకముందు మాత్రం సరసమ్మగారు వచ్చి తీర్థనాథ్ గారు వున్నారా? అనడిగేరండి. కాస్లో ఔటికెళ్లేరని చెప్పేసండి. వారొచ్చేవరకూ డ్రాయింగ్ రూంలో కూర్చుంటానని లోనికెళ్ళేరండి'' అన్నాడు నౌఖరు.

తీర్థనాథ్ వైపు తిరిగి, "సరస ఎవ్వరు?'' అడిగేను.

"నా స్నేహితురాలు! పీపుల్స్ కాలేజ్‌లో లెక్చరర్ గా పనిజేస్తోంది.''

"జీవన్ వచ్చేవరకూ ఆమె ఇక్కడే వుందా?'' అడిగేను నౌఖర్ని.

"తెలీదండి. నేను వేరే పనిమీదెళ్ళి తిరిగొచ్చి చూస్తే, డ్రాయింగ్ రూంలో ఆవిడ కనిపించలేదండి.''

అతన్ని వెళ్ళమన్నట్టు సైగజేసి, "మిస్టర్ తీర్థనాథ్! మీకూ, సరసకూ ఎప్పటినించి స్నేహం?'' అడిగేను.

"చాలా రోజులనించి. మేమిద్దరం ప్రేమించుకున్నాం! అక్కయ్య పెళ్ళవగానే ఆమెని పెళ్ళి జేసుకోవాలనుకున్నాను.''

"ఆమె ఎక్కడుంటుంది?''

"ధనలక్ష్మి కాలనీ, 3-1-146 నెంబర్ ఇంట్లో.''

"ఆల్ రైట్! నే వెళ్ళి ఆమెని కలుసుకుంటాను. మీరిక్కడే వుండి పోలీసుల్ని పిలిపించి, శవాన్ని వాళ్ళకప్పగించండి'' అన్నాను.

తీర్థనాథ్ తలూపేడు.

## 5

ధనలక్ష్మి కాలనీలో సరస ఇల్లు కనుక్కోడం ఏమంత కష్టం కాలేదు. తలుపు మూసివుంది. గడపకి వున్న

కాలింగ్ బటన్ నొక్కేను.

రెండునిమిషాల తరవాత తలుపు తెరుచుకుంది.

ఆమెని చూడగానే అనుకున్నాను. తీర్థనాథ్, అందాన్ని అంచనా వెయ్యడంలో మంచి ప్రావీణ్యం కల వాడని.

"మిస్ సరస మీరే కదూ?" అడిగేను.

ఆమె తలూపి, ప్రశ్నార్థకంగా చూసింది.

"అయామ్ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి ఫ్రం క్రయిం బ్రాంచ్!" అన్నాను. ఇన్‌స్పెక్టర్...క్రయిం బ్రాంచ్ అనగానే ఆమె బెదిరిపోయినట్టు కనిపించింది.

"నేను మీతో మాట్లాడాలని వచ్చేను" అన్నాను.

"రండి. లోనికి రండి" అంది వణికే కంఠంతో.

లోనికెళ్ళగానే, "కూర్చోండి" అంది సోఫాలు చూపిస్తూ.

"సరసాదేవి! కొన్నిగంటల క్రితం మీరు తీర్థనాథ్ ఇంటికి వెళ్లేరు కదూ?" అడిగేను సోఫాలో కూర్చుని.

"ఔను. ఏం జరిగిందక్కడ?" అంది ఆతృతగా.

"చెబుతాను. ముందు నా ప్రశ్నకి జవాబివ్వండి. మీరక్కడ ఎంత సేపున్నారు?"

"ఎంత సేపున్నానో ఖచ్చితంగా చెప్పలేను. తీర్థనాథ్ కోసం వెళితే, లేడని చెప్పేడు నౌఖరు. కాసేపు కాచుకుందామని డ్రాయింగ్ రూంలో కూర్చున్నాను. ఎంతకీ వచ్చే సూచనలు కనిపించకపోతే, విసుగెత్తి వచ్చేశాను.",

"జీవన్ తిరిగి వచ్చేవరకూ మీ రక్కడే వున్నారా?"

"లేదు. నేనతనికోసం వెళ్ళలేదు కదా? అతను ఇంట్లో వున్నాడో లేడో కూడా నాకు తెలియదు. ఇంతకీ

ఏం జరిగిందో మీరు చెప్పడంలేదు!"

"సరసాదేవీ! ఈ ఒక్క రోజులోనే ప్రసాదరావ్, రత్నరాశీ, జీవన్ ముగ్గురూ చంపబడ్డారు" అన్నాను ఆమెని పరీక్షగా చూస్తూ.

ఆ వార్త వినగానే సరస కంఠంనించి చిన్న కేక బైటికి వచ్చింది. ఇంకా ఏదో అనబోయేను. సరిగ్గా అప్పుడే టెలిఫోన్ గణగణ మోగింది.

సరస లేచివెళ్ళి, ఫోన్ విని, "మీకు!" అంది.

లేచి రిసీవర్ అందుకున్నాను.

"సార్జంట్ డేవిడ్ స్పీకింగ్!" వినిపించింది అవతలి నించి.

"నువ్వా? నే నిక్కడున్నానని ఎలా తెలిసింది?" అడిగేను.

"మీరు తీర్థనాథ్ వెంట వెళ్ళేరు కదా, అక్కడే వుండి వుంటారని అక్కడికి ఫోన్ జేసేను. ధనలక్ష్మీ కాలనీలో ఓ ఇంటికి వెళ్ళేరని ఆ ఇంటి ఫోన్ నెంబర్ చెప్పేడు" అన్నాడు డేవిడ్.

"ఏమిటి?"

"మరో హత్య జరిగింది."

"ఎక్కడ?" అడిగేను ఆశ్చర్యంగా.

"మెరీనా బీచి సమీపాన వున్న కొబ్బరితోటలో పడుంది శవం!"

"స్త్రీయా? పురుషుడా?"

"స్త్రీ!"

"శవానికి కళ్ళున్నాయా?"

"లేవు!"

"నీవు ఎక్కణ్ణించి మాట్లాడుతున్నావ్?"

"పబ్లిక్ టెలిఫోన్ బూత్ నించి."

"ఇప్పుడే వస్తున్నాను. అక్కడే వుండు" అని రిసీవర్ దించి సరసవేపు తిరిగేను. "మీరు మా అనుమతి లేకుండా ఎక్కడికీ వెళ్ళవద్దు. ఏ క్షణంలోనైనా వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను" అని బైటికి నడిచేను.

## 6

తోటలో డేవిడ్‌తోబాటు, ఆ ఏరియా పోలీస్ ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్స్ కూడా వున్నారు.

అది బీచికి దగ్గర్లో అందంగా పెంచిన తోట గనక అప్పుడప్పుడు బైటివాళ్ళుకూడా అక్కడికి షికారుకువస్తూ పోతుంటారు. డేవిడ్ నన్ను శవంవున్నచోటికి తీసికెళ్లేడు.

ఓ పొదల గుబురుదగ్గిర వెల్లికిలా పడుంది. ముప్పై ఏళ్ళుంటాయి ఆమెకి. ఎర్రగా, బొద్దుగా వుంది. ఉంగరాల జుత్తు. విచిత్రం ఏమిటంటే, వెనకటి శవాలలా కాక, ఇది నగ్నమైన శవం!

శవానికి కొద్దిదూరంలో పడున్నాయి బట్టలు. అవి ఉన్న తీరు చూస్తుంటే, హతురాలు తనకి తానే ఒంటిమీది బట్టలు ఒలిచి మడతపెట్టి అక్కడ పెట్టివుంటుందని తోస్తోంది. శవంమీద ఎలాటి గాయాలు లేవు.

దీన్నిబట్టి హంతకుడు ఈసారి హత్య జెయ్యకముందు హతురాలిని అనుభవించేడని స్పష్టమౌతోంది.

సాలోచనగా తలూపి, "శవం ఇక్కడుందని మీకు ఇన్ఫర్మేషన్ ఎవరిచ్చేరు?" అడిగేను డేవిడ్‌ని.

"తోటమాలి తొమ్మిదిగంటల ప్రాంతంలో క్రోటన్స్ కట్ జేస్తూ ఇటువైపు వచ్చేడుట. శవం కనిపించగానే,

పరిగత్తి పోలీస్ స్టేషన్‌లో చెప్పేడుట. ముఖ్యవిషయం ఏమిటంటే, నిన్న సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో ఈ స్త్రీ ఎవ్వరో మగాడివెంట తోటలోకి రావడం తోటమాలి చూసేడు" అన్నాడు డేవిడ్.

"ఆ తోటమాలి ఎక్కడ?"

రెండు నిమిషాల తరవాత తోటమాలి హాజరయ్యేడు.

"ఈ స్త్రీ నిన్న సాయంత్రం ఓ వ్యక్తివెంట యిక్కడికి వచ్చినట్టు చెప్పేవుట. ఆ వ్యక్తి ఎలా వుంటాడు?" అడిగేను.

"సూటూ బూటులో ఎర్రగా, పొడుగ్గా వున్నాడు బాబూ! కళ్ళకి నల్లజోడు పెట్టుకున్నాడు' చేతికర్ర పట్టుకుని కాస్త కుంటుకుంటూ నడుస్తాడు.

చీకటి పడేవేళ అళ్ళిద్దరూ గేటుగుండా తోటలోకి రావడం చూసేను. భార్యాభర్తలై వుంటారనీ, షికారుకి వచ్చివుంటారనీ అనుకున్నాను" అన్నాడు తోటమాలి.

"ఆ వ్యక్తికి సుమారు ఎన్నేళ్ళుంటాయి?"

"ముప్పై, ముప్పై ఐదేళ్ళుంటాయి బాబూ!"

"అతని వెంటున్నప్పుడు ఈ స్త్రీ భయపడుతున్నట్టు కనిపించిందా?"

"లేదు బాబూ! ఇద్దరూ నవ్వుకుంటూ, కులాసాగా కబుర్లాడుకుంటూ వచ్చేరు!"

"తిరిగి అతను బైటికెళ్ళడం నువ్వు చూశ్ళేదా?"

"చూళ్ళేదు బాబూ! అళ్ళు లోనికి రాగానే, నేను పనిమీద బజారెళ్ళేను. తిరిగొచ్చి చూస్తే ఇద్దరూ కనిపించలేదు. ఎల్లిపోనారనుకున్నాను."

సాలోచనగా తలూపుతూ శవాన్ని సమీపించేను. ఆ

స్త్రీ ఎవ్వరో గుర్తించాలంటే ఒకేఒక ఆధారం బట్టలు! బట్టలమీద చాకలి గుర్తులద్వారా ఏదైనా తెలిసే అవకాశం వుంది.

బట్టల్ని జాగ్రత్తగా ఒక్కొక్కటే ఎత్తి చూసేను.

చాకలి గుర్తులు లేవు!

వాటిని కొత్తగా కుట్టించుకున్నట్టుంది. ఇంకా చాకలికి వెయ్యలేదు. పెదవి విరుస్తూ డేవిడ్‌ని చూసి, "అంబులెన్స్‌నీ, ఫోటోగ్రాఫర్లనీ పిలిపించి, క్లోజప్‌లో ఆమె ఫోటోలు తీయించాలి. ఆ ఫోటోలు రేపటి దినపత్రికల్లో ప్రకటించాలి. దాంతో ఈమెకి సంబంధించినవాళ్ళెవ్వరైనా వచ్చే అవకాశముంటుంది" అన్నాను.

డేవిడ్ తలూపేడు.

## 7

"మే ఐ కమిన్ సర్?" అన్న కంఠం విని,

ఫైలు చూస్తున్నవాణ్నల్లా తలెత్తి, "ఎస్!" అన్నాను.

స్ప్రింగ్ డోర్స్ తెరుచుకున్నాయి.

తెల్ల పాంటూ, తెల్ల షర్టూ వేసుకున్న ఓ వ్యక్తి వచ్చేడు లోనికి.

అతని మొహంలో విషాదం స్పష్టంగా వ్యక్తమౌతోంది.

అంతకుముందు అతన్ని యెక్కడా చూసిన గుర్తులేదు.

"ప్లీజ్, టేక్ యువర్ సీట్!" అన్నాను మర్యాదకి.

"నన్ను డాక్టర్ వివేకానంద్ అంటారు. ఈ రోజు పత్రికల్లో ప్రకటించిన శవం ఫోటోలు నా భార్యవే!" అన్నాడతను కుర్చీలో కూర్చుంటూ.

"అది మీ భార్య శవమే అని ఖచ్చితంగా చెప్పగలరా?"

అతను తలూపి, "చెప్పగలను. మూడురోజుల క్రితం తన స్నేహితురాలి యింటికి వెళ్ళొస్తానని చెప్పి వెళ్ళింది. అప్పుడు ఉదయం ఎనిమిదిగంట లవుతుం దనుకుంటాను. రాత్రి ఎనిమిది గంటలవరకూ ఎదురుచూసేను. రాలేదు.

దురదృష్టవశాత్తు ఆమె స్నేహితురాలి ఇల్లెక్కడో నాకు తెలీదు. అందుకే కనుక్కోలేకపోయేను. మర్నాటి మధ్యాహ్నంవరకూ ఎదురుచూసి, ఏదో జరిగివుంటుందని, స్థానిక పోలీసులకి రిపోర్ట్ ఇచ్చేను. ఈరోజు న్యూస్ పేపర్ చూసేక తెలిసింది, నా భార్య హత్య జెయ్యబడిందని" అన్నాడు.

"ఆమె పేరేమిటి?"

"ఉపేక్ష!"

"మీ వివాహమై ఎన్నాళ్ళయింది?"

"ఇది రెండో సంవత్సరం! ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్ళం. ఇటువంటి ఘోరం జరుగుతుందని ఎన్నడూ ఊహించలేదు" అన్నాడతను పూడుకుపోయిన కంఠంతో.

"మీ భార్యకి ఆడస్నేహితులతోబాటు, మగ స్నేహితులుకూడా వుండేవారా?"

వివేకానంద్ తల విదిలించి, "నో!" అన్నాడు.

"బాగా ఆలోచించి చెప్పండి. ఇలా దేని కడుగుతున్నానంటే ఆమె హత్య జరిగినరోజు సాయంత్రం ఏడు గంటలకి ఓ వ్యక్తి వెంట, మెరీనా బీచి దగ్గర్లోవున్న కొబ్బరితోటలోకి వెళ్ళినట్టు మా దగ్గిర సాక్ష్యం వుంది.

ఆమె వెంటవున్న వ్యక్తి పొడుగ్గా, ఎర్రగా వుంటాడు. చేతిలో స్టిక్ పట్టుకుని కాస్త కుంటుతూ నడుస్తాడు. మీకు గానీ, మీ భార్యకి గానీ అటువంటి పోలికలు గల

ఏ వ్యక్తితోనైనా పరిచయముందేమో బాగా ఆలోచించి చెప్పండి."

వివేకానంద్ కాసేపు ఆలోచించి, "నో! ఎవరూ లేరు!" అన్నాడు.

"నా ఈ చివరి ప్రశ్నకి మీరు సూటిగా జవాబివ్వాలి. మీ భార్య ఆ వ్యక్తి వెంట ఆ తోటలోకి తనకు తానుగా వెళ్ళింది. ఆమె శవం అక్కడ నగ్నంగా దొరికింది. ఎవ్వరి బలాత్కారం లేకుండా ఆమె తనంతట తాను బట్టలు విడిచినట్టు నా అంచనా! ఈ ఆధారంతోనే ఈ ప్రశ్న అడుగుతున్నాను. ఆమె క్యారెక్టర్ ఎటువంటిది?" అడిగేను అతని కళ్ళల్లోకి చూస్తూ.

సిగ్గుతోనో, కోపంతోనో అతని మొహం ఎర్రబడింది. కాసేపు ఆలోచించి అన్నాడు. "ఇన్‌స్పెక్టర్! నాకు తెలిసినంతవరకూ ఉపేక్షకు మత్తుమందులు వాడే అలవాటు తప్ప మరే దురలవాటూ లేదు."

ఆ జవాబుతో నా బుర్ర తీవ్రంగా పనిజెయ్యసాగింది.

"ఆమెకి మత్తుమందులు వాడే అలవాటుందేదా? ఏయే మందులు వాడేది?" అడిగేను ఆతృతగా.

"ఒకసారి ఉపేక్షకి తీవ్రంగా జ్వరం వచ్చింది. రాత్రంతా నిదరపట్టక మూలుగుతుంటే, పెథిడిన్ ఇంజక్షన్ యిచ్చేను. ఆ ఇంజక్షన్ యిస్తే పేషెంట్ తాత్కాలికంగా బాధమరిచి నిదరపోతాడు. సాధారణంగా ఆ ఇంజెక్షన్ని ఆడవాళ్ళు ప్రసవించే సమయాల్లో వాడతారు.

ఉపేక్షకి ఆ ఇంజెక్షన్ యిచ్చేక, ఆ రాత్రి సుఖంగా నిదరపోయింది. మర్నాడు తనే కోరింది ఆ ఇంజెక్షన్ యివ్వమనీ, బాగా నిదర పడుతుందనీ యిచ్చేను. మూడో

రాత్రీ అడిగింది. ఇచ్చేను. అంతే!

ఉపేక్ష దానికి దాసురాలైపోయింది. ఆ ఇంజక్షన్ రుచి మరిగిన వ్యక్తి జీవితం నరకప్రాయమై పోతుంది. అందుకే, నేను భయపడి, అది తీసుకోవద్దనీ, దానివల్ల అనేక నష్టాలు కలుగుతాయనీ ఉపేక్షకి లక్షసార్లు చెప్పేను.

వినలేదు. మా ఇంట్లోనే నా డిస్పెన్సరీ వుంది. ఉపేక్ష నా కళ్ళు గప్పి పిల్లిలా డిస్పెన్సరీలోంచి ఆ ఇంజెక్షన్స్ కాజెయ్యసాగింది. అది పసిగట్టి ఆమె కవి అందుబాటులో వుండకుండా డిస్పెన్సరీనించే తీసివేసేను.

దాంతో ఉపేక్ష మెడికల్ షాప్స్ శరణుజొచ్చింది. డాక్టర్ ప్రిస్క్రిప్షన్ లేనిదే ఆ ఇంజక్షన్ అమ్మడం చట్ట రీత్యా నేరం! ఐనా, మెడికల్ షాప్ వాళ్ళు తమ స్వార్థం కొద్దీ, అడిగినవాళ్ళకి, డాక్టర్ చీటీ లేకున్నా, రెట్టింపు ధరకి అమ్ముతుంటారు.

ఉపేక్ష ఆ విధంగా సంపాదించేది వాటిని. సిరెంజిలో మందు ఎక్కించి తనకి తానే ఇంజక్షన్ తీసుకునేది. బజార్లో ఆ ఇంజక్షన్ స్టాక్ ఐపోతే, దొరక్కుంటే, లిపిటన్, మార్ఫిన్, నల్లమందువంటి మత్తుపదార్థాలు వాడేది.

ఆమెని ఆ దురలవాట్లనించి మళ్ళించడానికి అనేక ప్రయత్నాలు జేసేను. ఈ మధ్యే కొద్దిగా దారికి వచ్చి నట్టు కనిపించింది'' అన్నాడు డాక్టర్ వివేకానంద్.

నాలో మెరుపులా ఓ ఆలోచన తళుక్కుమంది. ఉపేక్షలాగే హత్యజెయ్యబడ్డ మిగతావాళ్లూ అటువంటి మత్తుపదార్థాలు వాడేవారా? హంతకుడు వాళ్ళ ఆ బలహీనతను తన స్వప్రయోజనానికి ఉపయోగించు

ఉంటున్నాడా?

కనుక్కోవాలి. వెంటనే ఈ విషయం కనుక్కోవాలి.

“ఆల్ రైట్ డాక్టర్! మీరు మీ భార్య శవాన్ని తీసి కెళ్ళవచ్చు. అవసరం కలిగితే మళ్ళీ మిమ్మల్ని కలుసు కుంటాను” అని సార్జంట్ డేవిడ్ ని పిలిచి శవాన్ని అతని కప్పగించవలసిందిగా ఆదేశించేను.

వివేకానంద్ సార్జంట్ వెంట వెళ్ళిపోయేడు.

ఆఫీసులోంచి బైటపడి, జీప్ ఎక్కి, తీర్థనాథ్ ఇంటికి బైలుదేరేను.

# 8

“మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి” అన్నాను తీర్థనాథ్ తో.

“చెప్పండి!” అన్నాడు.

“హత్య జెయ్యబడ్డ మీ సెక్రెటరీ ప్రసాదరావ్ కి ఏవైనా మత్తుమందుకు తీసుకునే అలవాటుండేదా? బాగా ఆలోచించి చెప్పండి!” అన్నాను సిగరెట్ అంటించి.

తీర్థనాథ్ కాసేపు ఆలోచించి, “స్పష్టంగా చెప్పలేను. కాని, ఒకటి రెండుసార్లు ప్రసాదరావ్, నాకు దగ్గరగా నిల్చుని మాట్లాడినప్పుడు అతని నోటినించి అదోరకం వాసన వేసింది.

ఏమిటని అడిగితే, తన నోట్లో అప్పుడప్పుడూ గమ్ బాయిల్ (పంటి చిగుళ్ళు ఉబ్బే జబ్బు) వస్తుందనీ, అది తగ్గడానికి మందు వాడతాననీ చెప్పేవాడు. అంతే నాకు తెలిసింది” అన్నాడు.

“సరే, మీ బంధువు జీవన్ కికూడా అటువంటి అలవా టేదైనా వుండేదా?” అడిగేను.

తీర్థనాథ్ కాసేపు ఆలోచించి, "ఇదీ సరిగ్గా చెప్ప లేను. కారణం, ఆ దృష్టితో నే నెప్పుడూ వాళ్ళని చూడ లేదు. ఒకరి గురించి అంతగా పట్టించుకునే తీరికా నాకు లేదు" అన్నాడు.

"చివరి ప్రశ్న. చాలా ముఖ్యమైన ప్రశ్న యిది. ప్రసాదరావ్‌లాగే మీ అక్కయ్యకూడా అటువంటి మత్తుమందులు వాడుతుందని ఎప్పుడైనా అనుమానం వేసిందా మీకు?"

"అక్కయ్యా, నేనూ ఏ రెండురోజులకో ఒకసారి కలుసుకునేవాళ్ళం. అదీ కొద్ది నిమిషాలే. ఆమెకి డబ్బు అవసరమైతే ఇక్కడికి వచ్చి తీసికెళ్లేది. ఆమెని చూడా లనుకున్నప్పుడు నేనే ఆమెదగ్గరి కెళ్లేవాణ్ణి. అక్కయ్య స్వంత విషయాలు నాకన్నా సరసకే బాగా తెలుసు" అన్నాడు తీర్థనాథ్.

"వాళ్ళమధ్య అంత స్నేహం వుండేదా?" అడిగేను ఆశ్చర్యంగా.

తీర్థనాథ్ నవ్వి, "అక్కయ్య ద్వారానే సరస నాకు పరిచయమైంది. వాళ్ళది చాలా పాత స్నేహం!" అన్నాడు.

"ఐతే, సరసకి ఫోన్ జేసి వెంటనే యిక్కడికి రమ్మ నండి."

తీర్థనాథ్ తలూపి, ఫోన్ దగ్గరి కెళ్ళేడు.

అరగంట తరవాత టాక్సీలో వచ్చింది సరస.

నన్ను చూడగానే ఆమె కళ్ళల్లో భయం కనిపించింది. ఆమె భయాన్ని దూరం జెయ్యడానికి చిరునవ్వు నవ్వేను.

"ఇన్‌స్పెక్టర్ గారు నీతో ఏదో మాట్లాడాలిట. అందుకే ఫోన్ జేశాను" అని నావైపు తిరిగి, "మీరిద్దరూ

మాట్లాడుతుండండి. నేనిప్పుడే వస్తాను" అంటూ బైటికి నడిచేడు తీర్థనాథ్.

"కూర్చోండి" అన్నాను సరసని.

బెదురుతూ కూర్చుంది సోఫాలో.

సిగరెట్ అంటించి చాలా నింపాదిగా అడిగేను. "సరసాదేవీ! మీకూ, రత్నరాశికీ మధ్య మంచి స్నేహం వుండేదని తెలిసింది. నిజమేనా?"

సరస తలూపి, "మేమిద్దరం ఆదర్శ మహిళామండలి సభ్యులం. ఏడాది క్రితం అక్కడే రత్నరాశితో నాకు పరిచయమైంది. ఆ పరిచయమే స్నేహంగా మారింది. తరుచూ ఇద్దరం కలుసుకునేవాళ్ళం!" అంది.

"ఐతే, ఆమె అలవాట్లూ, అభిరుచులతో మీరు బాగా పరిచితులై వుంటారనుకుంటాను?"

"ఔను!"

"ఆమెకి మత్తుపదార్థాలు వాడే అలవాటుండేదా?"

హఠాత్తుగా వేసిన ఈ ప్రశ్నతో సరస మొహం పాలిపోయింది.

చెప్పడానికి తటపటాయిస్తున్నట్టు కనిపించింది.

"చెప్పండి!" అన్నాను రెట్టించి.

చివరికి "ఔను!" అంది.

"ఎలాటి పదార్థాలు వాడేది?"

"గుండ్రంగా, తెల్లగా వుండేవి ఆ బిళ్ళలు!"

"వాటి పేరేమిటి?"

"తెలీదు. కాని, రత్నరాశి ఆ బిళ్ళలు యెక్కడ కొనేదో మాత్రం చెప్పగలను."

"ఎక్కడ కొనేది?"

"మూర్ మార్కెట్‌లో వున్న పార్కర్ మెడికల్ షాప్‌లో!"

"ఆ షాప్ పేరు మీ కెలా తెలుసు?"

"ఒక్కోసారి మే మిద్దరం కలిసి బజారుకో, సినిమాకో వెళ్ళేవాళ్ళం. అప్పుడు కొనడం చూసేను."

"అటువంటి అలవాటేదైనా మీకూ వుందా?"

సరస తల విదిలించి, "నో!" అంది.

"ఎప్పుడైనా రత్నరాశి మీకూ ఆ బిళ్ళలు తినమని ఇచ్చిందా?"

"ఔను! ఒకసారి అడిగేను, ఆ బిళ్ళలు దేనికి కొంటావూ? ఏదైనా జబ్బా? అని. అందుకు రత్నరాశి నవ్వి, ఓ బిళ్ళ నా చేతికిస్తూ వేసుకోమనీ, స్వర్గంలో వున్నట్టు అనుభూతి కలుగుతుందనీ చెప్పింది.

ఏమిటో చూద్దామని వేసుకున్నాను. అంతే! కాళ్ళూ, చేతులూ గాలిలో తేలిపోతున్నట్టూ, నింగీ - నేలా ఏక మౌతున్నట్టూ, మస్తిష్కం ఆలోచనారహితమై పోయి నట్టూ తోచింది. మొదటిసారి కనక, వాంతికూడా జేసు కున్నాను. అప్పటినించే అవంటే అసహ్యమేసింది.

అప్పుడు తెలిసింది, రత్నరాశి వాడే ఆ బిళ్ళలు జబ్బు కోసం కాదు, మత్తుకోసం వాడేవి అని! నీకీ అలవాటు ఎలా పడిందని అడిగితే, ప్రసాదరావ్ వల్ల అని చెప్పింది!"

"థాంక్యూ మిస్ సరసా! మీవల్ల ఎంతో విలువైన విషయాలు తెలిసేయి. ఇక మీరు వెళ్ళవచ్చు" అంటూ లేచాను.

తీర్థనాథ్ దగ్గర సెలవు తీసుకుని అక్కణ్ణించి బయలు దేరాను.

# 9

పార్కర్ మెడికల్ షాప్ ముందు జీప్ ఆపి దిగేను. చాలా పెద్ద షాప్ అది. నలుగురైదుగురు మగ సేల్స్ మెన్స్‌తోబాటు, సేల్స్ గర్ల్స్‌కూడా పనిజేస్తారక్కడ. మెడికల్ షాప్ పక్కనే పార్కర్ డిస్పెన్సరీ వుంది.

సాలోచనగా తలూపుతూ షాప్‌లోకి నడిచేను.

నన్ను చూడగానే, "చెప్పండి?" అన్నాడు ఓ సేల్స్‌మెన్.

నేను యూనిఫాంలో లేను గనక, పోలీస్ ఇన్‌స్పెక్టర్నని తెలిసే అవకాశం లేదు. క్రయింబ్రాంచివాళ్ళు సాధారణంగా యూనిఫాంలో వుండరు. "ఈ షాపు యజమానీ, లేదా మేనేజర్ని కలుసుకోవాలి" అన్నాను.

అతను ఎగాదిగా చూసి, "యజమాని ఎప్పుడో ఒకసారి వస్తారు. మేనేజర్ లోపల వున్నారు. కాని, వేరే పనిలో వున్నారు – బిజీగా. తనకోసం ఎవ్వరైనా వస్తే తరవాత రమ్మనమని యింతక్రితమే చెప్పేరు" అన్నాడు.

"అయామ్ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి ఫ్రం క్రయిం బ్రాంచ్. వెళ్ళి చెప్పండి. ఆయన్ని అర్జెంటుగా చూడాలి" అన్నాను అధికారపూర్వకంగా.

క్రయింబ్రాంచ్ అనగానే అతని ముఖం రంగులు మారింది.

మరేమీ మాట్లాడకుండా లోనికెళ్లేడు.

ఐదునిమిషాలు ఓపిగ్గా కాచుకున్నాను.

అతను తిరిగివచ్చి, "రండి!" అన్నాడు.

అతన్ని అనుసరిస్తూ, 'మేనేజర్' అని రాసివున్న గదిలోకెళ్లేను. నన్ను చూడగానే అతను కుర్చీలోంచి లేచి,

"గ్లాడ్ టు సీ యూ సర్! మీ గురించి చదవడమేకాని, ప్రత్యక్షంగా చూసే అవకాశం కలగలేదు. ప్లీజ్, టేక్ యువర్ సీట్. నా పేరు ప్రవీణ్ కుమార్!" అన్నాడు షేక్ హాండ్ ఇస్తూ.

కుర్చీలో కూర్చుంటూ అతన్ని పరీక్షగా చూసేను. ముప్పై, ముప్పై ఏదేళ్ళుంటాయి. ఎర్రగా, పొడుగ్గా వున్నాడు. ఉంగరాల జుత్తు, ఆఫ్ కలర్ సూటు వేసు కున్నాడు.

"మిస్టర్ ప్రవీణ్ కుమార్! మీ షాప్ లో పెథిడిన్, మార్ఫిన్ వంటి ఇంజెక్షన్లూ, లిపిటన్ వంటి టాబ్ లెట్సూ అమ్ముతారా?" అడిగేను, అసలు విషయానికి వస్తూ.

అతను తలూపి, "ఔను. వాటిని అమ్మడానికి మా దగ్గర లైసెన్సు వుంది. ఇంతకీ, మా షాప్ మీద ఎవ్వరైనా కంప్లైంట్ యిచ్చేరా?" అడిగేడు ఆశ్చర్యంగా.

"చెబుతాను. ముందు ఆ డ్రగ్స్ని అమ్మే సేల్స్ మెన్ని యిక్కడికి పిలిపించండి" అన్నాను జేబులోంచి సిగరెట్ తీస్తూ.

ప్రవీణ్ కుమార్ అక్కడే నిల్చున్న సేల్స్ మెన్ని చూసి, "స్వరూపని పిల్చుకురా!" అన్నాడు.

ఐదునిమిషాల తరవాత ఓ అందమైన యువతి వచ్చింది.

"డ్రగ్స్ అమ్మే కౌంటర్లో ఈమే పనిజేస్తుంది" అన్నాడు ప్రవీణ్ కుమార్.

"మీరా డ్రగ్స్ని ఏ ప్రొసీజర్ మీద అమ్ముతారు?" అడిగేను ఆ అమ్మాయిని.

"డాక్టర్ ప్రిస్క్రిప్షన్ లేనిదే ఎట్టి పరిస్థితిలోనూ డ్రగ్స్ ఇవ్వను."

"ఏ ఐటమ్ ఏయే మోతాదులో అమ్ముతారు?"

"ఇంజెక్షన్ ఐతే రెండు, టాబ్లెట్స్ ఐతే నాలుగు!"

"డాక్టర్ ప్రిస్క్రిప్షన్ లేని కస్టమర్లుకూడా వస్తుంటారా?"

"వస్తుంటారు. కాని, ఎట్టి పరిస్థితిలోనూ వాళ్ళకి మందులివ్వను."

"అటువంటి కస్టమర్స్, రేటుకి రెండింతలిస్తామని ఆశ పెడుతుంటారా?"

"ఔను. ఐనా వాళ్ళకి నిర్మొహమాటంగా చెప్పేస్తాను ఇవ్వనని."

"థాంక్స్! ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాను.

ఆ యువతి వెళ్ళిపోగానే ప్రవీణ్‌కుమార్ వైపు తిరిగి, "ఈ షాప్ ఓనర్ ఎవ్వరు?"

"శ్రీకాంత్ గారు."

"ఆయనెక్కడుంటారు?"

"తిరువాన్మూర్‌లో. నెలకోసారి ఇక్కడికి వచ్చి, కమర్షియల్ ఎకౌంట్స్ చూసి పోతుంటారు."

"అంటే, ఇక్కడి కార్యభారమంతా మీరే చూసుకుంటారన్నమాట."

ప్రవీణ్‌కుమార్ తలూపేడు.

"మీ షాప్ కనుబంధంగా ఏదైనా డిస్పెన్సరీ వుందా?"

"ఉందిగా! మీరు చూసివుంటారు. షాప్ పక్కనే వుంది."

"ఆ డిస్పెన్సరీ ఎవరు నడుపుతారు?"

"అక్కడి ఏర్పాట్లుకూడా నేనే చూసుకుంటాను. డాక్టర్ భార్గవగారు మాత్రం ఉదయం రెండుగంటలూ,

సాయంత్రం రెండుగంటలూ వుండి, పేషెంట్స్‌ని చూసి పోతారు.''

''ఆయనిప్పుడు డిస్పెన్సరీలో వున్నారా?''

ప్రవీణ్‌కుమార్ టైం చూసి, ''నో! ఇంటిదగ్గర వుండి వుంటారు'' అన్నాడు.

''ఐ వాంట్ టు సీ హిమ్! ప్లీజ్, ఆయనకి ఫోన్ జేసి వెంటనే యిక్కడికి రమ్మని చెప్పండి!''

''ఇంతకీ మీ రివన్నీ దేని కడుగుతున్నారో చెప్పనే లేదు'' అన్నాడు ప్రవీణ్‌కుమార్ ఆశ్చర్యంగా.

నవ్వేను. ''మిస్టర్ ప్రవీణ్‌కుమార్! గత కొద్ది రోజుల్నించీ నగరంలో విచిత్రమైన హత్యలు జరుగుతున్నాయి. దాదాపు హతులందరూ మత్తుపదార్థాలకి అలవాటుపడ్డ వారేనని తేలింది. అంతేకాదు, ఆ డ్రగ్స్‌ని వాళ్ళ 'మీ షాప్‌నించే కొనేవారని మా దగ్గర ప్రత్యక్ష సాక్ష్యం వుంది'' అంటూ అతని ముఖంలోకి చూసేను.

అతనిలో భయంగానీ, ఖంగారుగానీ కనిపించక పోడంతో కాస్త ఆశ్చర్యం వేసింది.

కాసేపు మౌనంగా వుండి అన్నాడు ప్రవీణ్‌కుమార్. ''ఆల్‌రైట్. మీ పరిశోధనేదో మీరు జేసుకోండి. ఈ విషయంలో మీతో సహకరించడం, ఒక పౌరుడిగా నా ధర్మం'' అని టేబిల్‌మీది టెలిఫోన్ దగ్గరికి లాక్కున్నాడు.

ఓ నెంబర్ రింగ్ జేసి, కాసేపు మాట్లాడి, ''డాక్టర్ భార్గవ వస్తున్నారు!'' అన్నాడు.

అరగంట తరవాత, ఫుల్‌సూటులో వున్న వ్యక్తి గది లోకి ప్రవేశించేడు.

# 10

"వీరే డాక్టర్ భార్గవ!" అన్నాడు ప్రవీణ్ కుమార్.

ఏ యాభైఏళ్ళ ముసలివాడో అనుకున్న నేను, డాక్టర్ భార్గవని చూడగానే కాస్త ఆశ్చర్యపోయేను. కారణం, అతనికి దాదాపు ముప్పై ఐదేళ్ళుంటాయి. తెల్లగా, పొడుగ్గా వున్నాడు. పక్కపాపిడి తీసి దువ్వుకున్న జుత్తు. ప్రతి విషయాన్నీ క్షుణ్ణంగా పరిశీలిస్తున్నట్టుండే చురుకైన కళ్ళు.

"చెప్పండి ఇన్‌స్పెక్టర్! నన్ను దేనికి పిలిపించేరు?" అన్నాడు భార్గవ కుర్చీలో కూర్చుంటూ.

"కేవలం కొన్ని ప్రశ్నలడగడానికి!" అన్నాను సిగరెట్ తీస్తూ.

"అడగండి!" అన్నాడు భార్గవ నింపాదిగా.

"నా మొదటి ప్రశ్న ఇది. నిన్న సాయంత్రం ఆరు గంటలకి మీ రెక్కడున్నారు?" సూటిగా వదిలేను బాణం.

అతనుకూడా తొణక్కుండా, బెణక్కుండా జవాబిచ్చేడు చాలా గంభీరంగా. "రోజూ సాయంత్రం ఏడు గంటలకి, ఇక్కడికి వచ్చి పేషెంట్స్‌ని చూస్తాను. అంటే, ఇంటినించి ఆరున్నరకి బైలుదేరతానన్నమాట!"

"మీ దగ్గరికి వచ్చే పేషెంట్స్‌లో యెవరికైనా, పెథిడిన్, మార్ఫిన్ వంటి ఇంజెక్షన్స్‌కోసం రెకమెండ్ జేస్తారా మీరు?"

"ఔను. గేస్ ట్రబుల్, లేదా అపెండిసాయిట్ వంటి రోగులు ఒక్కోసారి నెప్పి భరించలేక, రాత్రుళ్ళు నిదర పట్టక నానాఅవస్థ పడుతుంటారు. సాధారణంగా అటు

వంటి పేషెంట్స్‌కే తాత్కాలిక ఉపశమనంకోసం ఆ ఇంజెక్షన్స్ వాడతాం!"

"దయచేసి బాగా ఆలోచించి చెప్పండి. ఎప్పుడైనా ప్రసాదరావ్ అనే యువకుడికీ, రత్నరాశి అనే యువతికీ మీ రటువంటి డ్రగ్స్‌కోసం రెకమెండ్ జేసేరా?"

డాక్టర్ కాసేపు ఆలోచించి, "సారీ! చెప్పలేను. కారణం, రోజూ ఎంతోమంది వస్తూపోతుంటారు. పేర్లు జ్ఞాపకం వుండవు. ఇంతకీ యివన్నీ యెందుకు అడుగుతున్నారు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎందుకంటే, వాళ్ళిద్దరూ దయనీయంగా చంపబడ్డారు. వాళ్ళే కాదు. గత ఐదారురోజుల్నించీ నగరంలో విచిత్రమైన హత్యలు జరుగుతున్నాయి. హతులందరూ దాదాపు ఏదో ఒక మత్తు పదార్థానికి దాసులైనవారే!"

"ఈ విషయాలతో నాకేమిటి సంబంధం?"

"సంబంధం వుంది మిస్టర్ భార్గవా? హత్యజెయ్యబడ్డ రత్నరాశీ, ప్రసాదరావూ యిదే మెడికల్ షాప్‌లో డ్రగ్స్ తీసుకునేవారని మా దగ్గర సాక్ష్యం వుంది."

"కావచ్చు. దానికి నేనెలా బాధ్యుణ్నవుతాను?"

"సరే, మీరు ఆపరేషన్స్‌కూడా చేస్తారు కదూ?"

భార్గవ తలూపేడు.

"ఐ స్పెషలిస్ట్‌కూడా అనుకుంటాను."

"ఔను..." అంటూ ఏదో జ్ఞాపకం వచ్చినట్టు పకపక నవ్వేడు భార్గవ. "ఓహో, ఇప్పుడర్థమైంది. కళ్ళు లేని ఆ శవాలకీ, నాకూ సంబంధం వున్నట్టు మీ రనుమానిస్తున్నారన్నమాట!"

నవ్వేను. "ప్రతి మనిషినీ అనుమానించడం పోలీసు

శాఖకి పుట్టుకతో వచ్చిన బుద్ధి కదా? అదలా వదలండి. మీకు డాక్టర్ వివేకానంద్ తెలుసా?"

"తెలుసు."

"ఆయన భార్య ఉపేక్షాదేవి తెలుసా?"

"తెలుసు!"

"ఎలా?"

"వాళ్ళిద్దరూ అప్పుడప్పుడూ క్లబ్బుకి వచ్చేవారు. అక్కడే పరిచయం."

"ఆమెకి మత్తుపదార్థాలు వాడే అలవాటుండేదా?"

"నాకు తెలియదు!"

"సో, ఆమె హత్య చెయ్యబడ్డట్టు మీకు తెలుసా?"

"తెలుసు. పేపర్లో చదివేను. చాలా ఆశ్చర్యపోయేను."

"ఈ నగరంలో వున్న డాక్టర్లలో స్టిక్ పట్టుకుని, కుంటుతూ నడిచే ఏ డాక్టరైనా తెలుసా మీకు?"

భార్గవ కాసేపు ఆలోచించి, "నో! తెలీదు" అన్నాడు.

"మీకీ నగరంలోని ప్రతి డాక్టర్‌తోనూ పరిచయం వుందనుకుంటాను."

భార్గవ తలూపేడు.

"వారిలో ఎవ్వరూ కుంటుతూ నడవరా?"

"నో. నో!"

"కంటి చికిత్సలో మంచి ప్రావీణ్యం గల ఏ డాక్టరైనా తెలుసా మీకు?"

"అటువంటి ఐ స్పెషలిస్ట్సు యెందరో వున్నారు."

"వారిలో ఎక్కువ వయసు లేనివాడూ, అందంగా, ఎర్రగా, పొడుగ్గా వుండేవాడూ, అందమైన కళ్ళు గల

ఆడవాళ్ళంటే పడి చచ్చేవాడూ, ఇలాటి ఐ స్పెషలిస్ట్ యెవ్వరైనా తెలుసా మీకు?"

భార్గవ నవ్వి, "తెలుసు!" అన్నాడు.

"ఎవ్వరతను?" అడిగేను ఆతృతగా.

"డాక్టర్ భార్గవ."

అతని జవాబు విని నిర్ఘాంతబోయేను.

"డాక్టర్ భార్గవా! వేళాకోళాలంటే నాకు గిట్టదు" అన్నాను సీరియస్‌గా.

అతను నవ్వి, "ఇందులో వేళాకోళం లేదే? మీరే చూస్తున్నారు కదా, నేను ఐ స్పెషలిస్ట్‌ని. ఎక్కువ వయసు లేనివాణ్ణి. అందంగా, ఎర్రగా, పొడుగ్గా వున్న వాణ్ణి. నిజం చెప్పాలంటే, అందమైన కళ్ళు గల ఆడదంటే పడి చచ్చేవాణ్ణికూడా."

సాలోచనగా తలూపి, "ఐతే, మీకు అనేకమంది అందమైన ఆడవాళ్ళతో పరిచయం వుందన్నమాట!" అన్నాను.

భార్గవ నవ్వి, "ఔను. ఉంది. కాని, వాళ్ళ పేర్లు తెలుసుకోడంవల్ల మీ కెలాటి లాభం వుండదు. కారణం, వాళ్ళింకా బ్రతికే వున్నారు" అన్నాడు.

"ఆల్ రైట్ డాక్టర్! ఈ విధంగా మీకు శ్రమ కలిగించినందుకు క్షమించండి. ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాను.

భార్గవ లేచి వెళ్ళిపోయేడు.

"మీ ప్రొప్రైటర్ శ్రీకాంత్ గారి ఎడ్రస్ ఏమిటి?" అడిగేను ప్రవీణ్‌కుమార్ని.

"తిరువాన్కూర్. 710-8-525. అక్కడ ఆయనకి పెద్ద ఆస్థి వుంది."

"భార్యాపిల్లలతో అక్కడే వుంటారన్నమాట."

"నో. నో. ఆయనకింకా పెళ్ళి కాలేదు!"

"ఆయన వయ సెంతుంటుంది?"

"ముప్పై ఐదేళ్ళుంటాయి."

"ఇంత చిన్న వయసా?"

తలూపేడు ప్రవీణ్ కుమార్.

"ఈ మెడికల్ షాప్ ప్రారంభించి ఎన్నేళ్ళయింది?"

"కేవలం మూడు సంవత్సరాలు."

"అంతకుముందు ఆయనేం జేసేవారు?"

"ఆయన డాక్టరు. ప్రైవేట్ డిస్పెన్సరీ నడిపేవాడు."

నాకు షాక్ తగిలినట్టు తోచింది. ఇంతవరకూ పరిచయమైనవాళ్ళంతా డాక్టర్లే! మెడిసిన్ చదివినవాళ్లే. వయసులో వున్నవాళ్లే.

హంతకుడూ డాక్టరేనని నా అనుమానం. ఆ హంతకుణ్ణి ప్రత్యక్షంగా చూసిన తోటమాలి వర్ణనబట్టి అతను అందమైనవాడు. వయసులో వున్నవాడు. కాని, చిక్కల్లా అతను చేతిలో స్టిక్ పట్టుకుని కుంటుతూ నడుస్తాడు. నాకు పరిచయమైన డాక్టర్లలో ఎవ్వరూ కుంటివాళ్ళు కారు. హంతకుడు పోలీసుల్ని తప్పుదారి పట్టించడానికే ఆ నాటక మాడుతున్నాడా?

"డాక్టర్ శ్రీకాంత్ ఇప్పుడు ప్రాక్టీసు పూర్తిగా మానేశారా?" అడిగేను.

ప్రవీణ్ కుమార్ తలూపి, "ఔను. ప్రాక్టీసుపట్ల ఆయనకి విసుగు పుట్టింది. దానికి బదులు, ఈ మెడికల్ షాప్

ఓపెన్ జేసి యిక్కడి కార్యభారమంతా నా కప్పగించి, ఆయన తిరువాన్కూర్‌లోని ఆస్తి విషయాలు చూసు కుంటూ అక్కడే వుంటున్నారు'' అన్నాడు.

''డాక్టర్ శ్రీకాంత్ ఎర్రగా, పొడుగ్గా, అందంగా వుంటారా?''

''ఔను. కాని, ఆయన స్టిక్ పట్టుకుని కుంటుతూ నడవరు!'' అన్నాడు ప్రవీణ్‌కుమార్ నవ్వుతూ.

''ఇంకా పెళ్ళికాలేదు గనక, ఆయనకి అందమైన ఆడ వాళ్ళ పిచ్చికూడా వుండి వుంటుంది?'' అన్నాను అతన్ని ఓరగా చూస్తూ.

ప్రవీణ్‌కుమార్ తల విదిలించి, ''ఆయన వ్యక్తిగత విషయాలు నాకు తెలీదు'' అన్నాడు.

''మిస్టర్ ప్రవీణ్‌కుమార్! దయచేసి, ఆయనకి ట్రంకాల్ జేసి ఇక్కడికి పిలిపించగలరా?'' అడిగేను.

అతను కాసేపు ఆలోచించి, ''ఆల్ రైట్! మీరు కోరు తున్నారు గనుక రిస్కు తీసుకోక తప్పదు'' అంటూ ఫోన్ దగ్గరికి లాక్కున్నాడు.

ఓ సేల్స్‌మెన్ హడావుడిగా లోనికి వచ్చి ''సార్! బాస్ వచ్చేరు'' అన్నాడు ప్రవీణ్‌కుమార్‌తో.

ప్రవీణ్‌కుమార్ వెంటనే లేచి బైటికెళ్ళేడు.

ఐదునిమిషాల తరవాత అతనివెంట ఫుల్‌సూట్‌లో ఉన్న ఓ వ్యక్తి లోనికి వచ్చేడు. అతన్ని చూడగానే అనుకున్నాను నా అంచనా తప్పుకాదని.

''డాక్టర్ శ్రీకాంత్ వీరే!'' అన్నాడు ప్రవీణ్‌కుమార్ అతన్ని పరిచయంజేస్తూ.

''వేరొకరైతే అంతదూరంనించి ఇలా ఉన్నపళంగా

వచ్చేవాణ్ణి కాదు. పోలీసులతో సహకరించడానికి నిరాకరించడం నా ప్రిన్సిపుల్స్‌కి విరుద్ధం!'' అన్నాడు శ్రీకాంత్ షేక్‌హాండ్ ఇస్తూ.

అతను కూర్చున్నాక, ఒకదాని తరువాత ఒకటిగా అనేక ప్రశ్నలు వేసేను.

కొత్తవిషయాలేవీ తేలలేదు.

నగరంలో హత్యలు జరుగుతున్న వార్తలు పత్రికల్లో చదువుతున్నాననీ, ప్రసాదరావ్, రత్నరాశీ, జీవన్, ఉపేక్షా, డాక్టర్ వివేకానంద్, తీర్థనాథ్‌లతో తనకెలాంటి పరిచయం లేదనీ చెప్పేడు.

అతన్ని కలుసుకున్న తరవాత నాలో ఓ పథకం తళుక్కుమంది.

వారిదగ్గిర సెలవు తీసుకుని హెడ్‌క్వార్టర్స్‌కి బైలుదేరేను.

# 11

''డేవిడ్! ఈ కేసులో ముఖ్య అనుమానితుల జాబితా ఒకటి తయారుజేసేను. వీళ్ళందరూ డాక్టర్లు! యువకులు. అందమైనవాళ్ళు. ఆ తోటమాలి మనకి చెప్పిన వివరాలని బట్టి, హంతకుడూ ఇవే ప్రత్యేకతలు కలవాడు. అతను చేతిలో స్టిక్ పట్టుకుని, కుంటుతూ నడవడం కేవలం నటన! మనల్ని తప్పుదోవ పట్టించడానికి వేసిన ఎత్తు.

సరే, ఈ రోజునించీ ఈ ఐదుగురి మీదా గట్టి నిఘా ఏర్పాటు జెయ్యాలి. వీళ్ళు ఎక్కడికి వెళ్ళినా, ఏం జేస్తున్నా మఫ్టీలో ఉన్న మన కానిస్టేబుల్స్ నీడలా వీరి కదలికలు కనిపెడుతుండాలి. దాంతో మన అనుమానం నిజమైనదో, లేక వట్టి అనుమానమో తేలిపోతుంది'' అన్నాను.

"వీళ్ళందరూ డాక్టర్లన్నారుకదా? మరి వీరి మధ్య ఆ మెడికల్ షాప్ మేనేజర్ ప్రవీణ్‌కుమార్ని దేనికి జేర్చేరు?" అన్నాడు డేవిడ్ ఆశ్చర్యంగా లిస్టును పరిశీలిస్తూ.

నవ్వేను. "అతనూ డాక్టరే! అందుకే అంత పెద్ద మెడికల్ షాప్‌కి అతన్ని మేనేజర్‌గా నియమించేడు శ్రీకాంత్. మెడికల్ షాప్‌లో అతన్ని కలుసుకున్నప్పుడు చూసేను. కూర్చునే బల్లమీద 'డాక్టర్ ప్రవీణ్‌కుమార్, ఎమ్.బి.బి.యస్.' అనే బోర్డు ఉండడం!"

"ఆల్‌రైట్ సర్! మీ పథకం నాకు నచ్చింది. వెంటనే ఏర్పాట్లు చేద్దాం!" అంటూ లేచేడు డేవిడ్.

తర్వాత చురుకైన కానిస్టేబుల్స్‌ని ఎన్నుకుని, వాళ్ళకు అన్ని ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి, ఒక్కో డాక్టర్ని కనిపెట్టడానికి ఒక్కొక్కర్ని పంపేను.

# 12

రాత్రి సరిగ్గా పదిన్నరకి బల్లమీది ఫోన్ మోగింది.

ఆత్రతగా రిసీవర్ అందుకుని, "ఎస్! రాజారెడ్డి స్పీకింగ్!" అన్నాను.

"నేను డాక్టర్ని వెంబడిస్తున్నాను సార్! ఏడుగంటల ప్రాంతంలో అతను గాంధీ పార్క్ నించి ఓ యువకుణ్ణి వెంటబెట్టుకుని టాక్సీలో మీనంబాకం దగ్గర దిగేడు.

టాక్సీవాణ్ణి పంపేసి, యువకుడితో కాలినడకన శిథిలమైన ఇళ్ళవేపు పోతున్నాడు. అక్కడంతా నిర్మానుష్యంగా, చీకటిగా ఉంది."

"నీవు ఎక్కణ్ణించి మాట్లాడుతున్నావు?"

"ఓ రెస్టారెంట్ నించి."

"వాళ్ళటు వెళ్ళి ఎంతసేపైంది?"

"ఇప్పుడే, ఐదు నిమిషాలై వుంటుంది. ఆ డాక్టర్ కుంటుతూ నడుస్తున్నాడు సార్!"

"ఆల్ రైట్, నువ్వక్కడే ఉండు. ఇప్పుడే వస్తున్నాం". అని రిసీవర్ దించి లేచేను.

"డేవిడ్! కమాన్, హారియప్" అంటూ బైటికి పరిగెత్తాను.

నలుగురు కానిస్టేబుళ్ళతో జీప్ ఎక్కి బైలుదేరాం. మీనంబాకం దగ్గర జీప్ దిగగానే, మఫ్టీ కానిస్టేబుల్ పరిగెత్తుకువచ్చి, శిథిలాల్లో వాళ్ళు ఏవైపు వెళ్ళారో చూపించేడు.

కానిస్టేబుల్స్‌ని ఆయుధాలతో ఆ శిథిలాలని చుట్టుముట్టమని చెప్పి, నేనూ, డేవిడ్ ఆవైపు అడుగులు వేశాం. బూట్సుల చప్పుడు కానివ్వకుండా విరిగిన గోడలూ, రాళ్ళ్ళ రప్పలూ దాటుకుంటూ, కప్పు కూలిన ఓ గదిని సమీపించాం.

చుక్కల వెలుగులో మసకమసకగా కనిపిస్తున్నాయి పరిసరాలు. జేబులోంచి టార్చిలైట్ తీసి ఎడంచేతిలో పట్టుకున్నాను. హోల్‌స్టర్‌లోంచి రివాల్వర్ తీసి, సేఫ్టీ కాచ్ లాగి కుడిచేతిలో రెడీగా పట్టుకున్నాను.

లోపలినించి, సన్నసన్నగా ఏవో చప్పుళ్ళు వినిపిస్తున్నాయి.

గోడ చాటునించి చటుక్కున లోనికెళ్ళి, టార్చి వెలిగించేను.

ఓ మూల, నేలమీద పడుంది ఓ ఆకారం. దాని పక్కనే కూర్చుని ఏదో చేస్తున్న వ్యక్తి టార్చి వెలుక్కి అదిరిపడి వెనుదిరిగేడు.

నా కళ్ళని నేను నమ్మలేకపోయాను. అతనెవ్వరో కాదు. ఉపేక్ష భర్త, డాక్టర్ వివేకానంద్!

మమ్మల్ని చూడగానే పిడుగుపడ్డట్టు లేచి నిల్చున్నాడు. అతని చేతులు రక్తసిక్తమై ఉన్నాయి.

"స్కౌండ్రల్! ఇన్నాళ్ళూ అందమైన యువతీ యువకుల్ని హత్యజేస్తూ వాళ్ళ కళ్ళు పీకుతున్న కిరాతకుడివి నీవేనన్నమాట!" అన్నాను వళ్ళు తెలీని కోపంతో.

వివేకానంద్ పలకలేదు. చమట్లు కక్కుతూ రాతి బొమ్మలా నిల్చున్నాడు. అప్పటికే, డేవిడ్ జేబులోంచి సంకెళ్ళు తీసి అతన్ని సమీపించేడు. చేతులకి బేడీలు వేస్తున్నా, వివేకానంద్ నోరు విప్పలేదు.

నేలమీద పడున్న ఆ ఆకారం ఇంకా అలాగే చలన రహితంగా పడుంది. అనుమానం వేసి, టార్చి వెలుగులో అటు నడిచేను. వేరొకరైతే ఆ దృశ్యం చూసి కెవ్వుమనే వారు.

మేము చాలా ఆలస్యంగా వచ్చాం. వివేకానంద్ అప్పటికే ఆ యువకుణ్ణి చంపి, ఓ కన్ను తీసేశాడు. శవం పక్కన ఆపరేషన్ కోసం వాడే ఇన్‌స్ట్రుమెంట్స్ పడున్నాయి. అన్నిటికీ రక్తం అంటి ఉంది.

వాటి మధ్యే తీసిన కన్నూ ఉంది.

వివేకానంద్ రెండో కన్ను తీస్తుండగా మేము వచ్చాం. పీకిన ఒంటికన్నుగుండా, రక్తం కారి వికృతంగా ఉంది శవం.

ఇక చూడలేక మొహం తిప్పుకున్నాను.

శవాన్నీ, హంతకుణ్ణీ జీప్ ఎక్కించి హెడ్ క్వార్టర్స్‌కి బయలుదేరాం.

* * *

మా పద్ధతులు ఉపయోగించేక నోరు విప్పేడు వివేకానంద్.

హాతులకీ, అతనికీ ఎటువంటి విరోధం లేదు. అతని క్కావలసిందల్లా అందమైన యువతీయువకుల కళ్ళు. ఆ కళ్ళను ప్రత్యేకమైన ప్లాస్టిక్ డబ్బాలలో, కెమికల్స్ మధ్య పెట్టి ప్యాక్ జేసి, రహస్యంగా విదేశాలకి పంపే వాడు.

ఆ కళ్ళు అక్కడ అంధులైన ధనవంతులకి అమర్చ బడేవి. ప్రతిఫలంగా వివేకానంద్ పేర్న లక్షలకి లక్షలు విదేశీ బ్యాంకుల్లోనే జమ అయ్యేవి. అలా కొన్ని లక్షలు అక్కడ పోగయ్యేక ఈ దేశం విడిచి వెళ్ళి అక్కడే స్థిర పడాలని ప్లాన్ వేసేడు. అందుకే, అందమైన తన భార్యనీ మట్టుబెట్టి, ఆమె కళ్ళుకూడా పార్శిల్ జేసేడు.

హత్యలకోసం అతను ఎన్నుకున్న వ్యక్తులు అందమైన వాళ్ళేగాక, రకరకాల మత్తుపదార్థాలకి అలవాటుపడ్డవారు కావడం గమనించతగ్గ విషయం! వివేకానంద్ అటువంటి వాళ్ళని గాలించి, పరిచయం జేసుకుని వాళ్ళకి కావలసిన మత్తుపదార్థాలని దండిగా సప్లై జేస్తూ, వాళ్ళని పూర్తిగా వాటి పిచ్చిలో పడేసి, తన పని తేలిగ్గా జరుపుకునేవాడు.

అతని మీద కోర్టులో ఛార్జిషీటు దాఖలుజేశాం. బహుశా మరణశిక్ష పడవచ్చు.

ఏది ఏమైనా, పెథడిన్, మార్ఫిన్ వంటి ఇంజక్షన్స్‌కి దాసులైన వ్యక్తులూ, నల్లమందు, గంజాయి, చరస్, లిపిటన్ వంటి విషపదార్థాలకి గులాములైన మనుషుల జీవితాలు నిరర్థకం, నిస్తేజం, నిశ్శబ్దం, చివరికి.

—: ఐపోయింది :—

# ఫురానా హంతకుడు

## వసుంధర

"ఆయనింట్లో లేరు" అంది సీత.

అతను నవ్వి "కావచ్చు. కానీ ఇంటికి వస్తారేమో కదా" అన్నాడు.

"వస్తారు. కానీ అందుకింకా రెండుగంటలు టయిముంది" సందేహంగా అంది సీత.

"ఫరవాలేదు. అంతసేపు వేచివుండడం నాకు కష్టం కాదు" అంటూ లోపల కడుగు వేశాడతను.

ఏంచేయాలో తోచలేదు సీతకు. అతను చూడ్డానికి చాలా మర్యాదస్తుడిలా కనబడుతున్నాడు. వయసు ముప్ఫైఏళ్ళుండవచ్చు. మాటల్లో సంస్కారం కనబడుతోంది. కానీ ఇంట్లో తనొక్కర్తే ఉంది. భర్త లేకుండా

అతను తనింట్లో రెండుగంటలసేపు వుండడం తనకు భయం కలిగించడం మాటటుంచి చూసేవాళ్ళకు బాగుండదు.

"మీా రెవరో తెలుసుకోవచ్చా?" అనడిగింది సంకో చంగా.

"ఏమీా కంగారుపడనవసంలేదు. అన్నయ్యా అని నన్ను నువ్వు పిలిస్తే ఆ పిలుపుకు అన్నివిధాలా న్యాయం చేకూర్చేలా ప్రవర్తించగలను" అన్నాడతను.

అతని ఏకవచన ప్రయోగం సీతకు చాలా బాధ కలిగించింది. అయినా ఏమీా అనలేకపోయింది. ఎటొచ్చీ అతని మాటలు మనసుకు కాస్త శాంతినిచ్చాయి. "ఇంతకీ మీా రెవరో చెప్పలేదు" అంది మళ్ళీ.

అతను చనువుగా వెళ్ళి ఒక కుర్చీలో కూర్చున్నాడు. సీత తలుపులు వేయలేదు. ఆమె గుమ్మందగ్గరే నిలబడింది.

"నే నెవరినో తెలుసుకోవలసిన అవసరం నీకు లేదు' కానీ నువ్వు నన్నందరికీ నీ అన్నయ్యగా పరిచయం చేయాలి. అది నీకే మంచిది" అన్నాడతను.

సీతకు చిరాకేసింది "నువ్వెవరో నాకు తెలియదు. నిన్ను నా అన్నవని చెప్పుకోవాల్సిన అవసరం నాకే ముంది?"

అతను చాలా తమాషాగా నవ్వి "వెరీగుడ్"అన్నాడు. "నువ్వు నన్నలా నువ్వనడమే బాగుంటుంది. అన్నయ్యా నే చెల్లెలూ మీారు మీారు అంటూ మన్నించరు." అని ఒక్క క్షణం ఆగి "నన్ను నీ అన్నగా చెప్పుకోవలసిన అవసరం నీకు బాగా వుంది. నేనీ ఇంట్లో కొంతకాలంపాటు అతిథిగా ఉండబోతున్నాను. మరేరకమైన బంధుత్వమూ మనకు శ్రేయస్కరం కాదు" అన్నాడు.

సీత ముఖం ఎర్రబడింది. "అన్నీ నువ్వనుకుంటే సరి పోదు. మే మంగీకరించాలికదా."

"చాలా పొరబడ్డావు" అన్నాడతను. "నాకొకరి అంగీకారానంగీకారాలతో పని లేదు. అనుకున్న పని అయే దాకా అనుకున్నచోట ఉండటానికి నేనెవరి అనుమతి కోసమూ ఎదురు చూడను."

సీత కాస్త భయపడినా తమాయించుకుని "మేమూ అంతే—మా అనుమతిలేనిదే మా ఇంట్లో ఎవ్వరూ ఒక్క క్షణం కూడా ఉండలేరు" అంది.

"అలాగా—ఆ సంగతి చూద్దాంకానీ, చూడు చెల్లాయ్ నీ పేరేమిటో చెప్పమ్మా! చెల్లెలి పేరు తెలియకుండా ఉన్నానంటే బాగుండదు" అన్నాడతను.

"మంచిది. నా పేరు సీత. నీ పేరు తెలుసుకోవచ్చా?" అనడిగింది సీత.

"కొంతమందికి పేర్లతో నిమిత్తముండదు. రోడ్డు మీద కూరలమ్మేవాడిని వాడమ్మే కూరలపేరుతో పిలుస్తారు తప్పితే పేరు తెలుసుకుందుకు ప్రయత్నించరు. అలాగే రిక్షావాళ్ళని, టాక్సీవాళ్ళని—వాళ్ళువాళ్ళు నడిపే వాహనాల పేర్లతో పిలుస్తారు. పల్లెటూళ్ళలో అయితే కొంత మందిని బొత్తిగా పేర్లతో పిలవరు. ఏయ్ మంగలీ—ఏయ్ చాకలీ అని వాళ్ళ వృత్తుల్నిబట్టి ఆపేర్లతో పిలుస్తారు. నేనూ అలాంటివాణ్నే!"

"చాలా డొంకతిరుగుడుగా చెబుతున్నావు. పేరు చెప్పవా?"

"చెబుతాను. కానీ నువ్వు భయపడతావేమోనని సందేహిస్తున్నాను."

"నాకేం భయంలేదు. అదేదో నువ్వింట్లో అడుగుపెట్టినప్పుడే పోయింది." అంది సీత.

"చాలా మంచిది. అయితే చెబుతున్నాను విను. వృత్తిని బట్టి నన్ను పిలవాలనుకుంటే హంతకుడు అని పిలవ్వచ్చు" అన్నాడతను.

సీత నివ్వెరపోయింది నోట మాటలేకుండా అతన్నే చూస్తూ ఉండిపోయింది.

## 2

ఇంట్లోకి అడుగుపెడుతూనే వీధి తలుపులు బార్లా తెరిచి ఉండడమూ, లోపల ఒక అపరిచిత వ్యక్తి కుర్చీలో కూర్చుని ఉండడమూ చూసి ఆశ్చర్యపడ్డాడు జనార్దనం. బహుశా భార్యకు సంబంధించిన బంధువై ఉంటాడనుకున్నాడు.

జనార్దనాన్ని చూస్తూనే ఆగంతకుడు లేచి "వచ్చేవా-రా బావా కూర్చో!" అన్నాడు.

అతని పలకరింపుకు ఆశ్చర్యపడుతూ జనార్దనం వెళ్ళి కుర్చీలో కూర్చుని బూట్లు విప్పుకోసాగాడు.

"సీతా బావొచ్చేశాడు" అంటూ గట్టిగా కేక పెట్టాడు ఆగంతకుడు.

వంటింట్లో పక్కింటావిడతో కబుర్లు చెబుతూన్న సీత లేచింది. పక్కింటావిడ దొడ్డిదారిన వెళ్ళిపోయింది. సీత వీధి గదిలోకి వచ్చింది. ఆగంతకుడు పెట్టిన కేక ఆమెకు చాలా అసహ్యంగా అనిపించింది.

సీత రాగానే "నీ బంధువుల్లో ఇలా ఓ అన్నయ్యున్నట్లు ముందే చెప్పివుండాల్సింది సీతా! ఇప్పుడు నేను వెర్రిముఖం వేసుకుని చూడాల్సిన అవసరం తప్పేది"

అన్నాడు జనార్దనం.

"నాకేం తెలుసు. రోడ్డునపోయే చాలామందికి నా కన్నయ్యలు కావాలనుందని" అంది సీత తీవ్రంగా. ఆగంతకుడి ముఖంలో అప్రసన్నత కనబడింది. జనార్దనం ముఖంలో ఆశ్చర్యం కనబడింది. అతనేమీ అర్థంకానట్లు ఇద్దరి ముఖాలూ మార్చిమార్చి చూశాడు.

"బావా నువ్వు నా చెల్లెలికి మర్యాదలు నేర్పలేదు. అన్నగారినే అనుకో. అయినా ఇంటికి వచ్చేక కాస్త కాఫీనీళ్ళయినా ఇచ్చిందేమో అడుగు" అన్నాడాగంతకుడు నిష్ఠూరంగా.

"ముక్కూ మొగం తెలియని మగవాడొచ్చి—మీరు లేరన్నాకూడా వినకుండా ఇంట్లో తిష్ఠవేసుకూర్చుంటే నేనేంచేసేది చెప్పండి. పక్కింటావిణ్ణి పిలిచి కబుర్లాడుతూ కూర్చున్నాను. ఆవిణ్ణి నేనే పిలిచి పనులు చేసుకుంటూ కూర్చుంటే బాగుండదుకదా—అందుకే ఈవేళ టిఫిన్ కూడా చేయలేదు" అంది సీత.

జనార్దనం ఆగంతకుణ్ని తీవ్రంగా చూసి "మిస్టర్ నువ్వు..." అన్నాడు.

ఆగంతకుడు నవ్వి "మీ ఇంట్లో ఆతిధ్యాన్ని కోరి వచ్చాను. సుమారు రెండు నెలలుంటాను. చుట్టుపక్కల అనుమానం రాకుండా ఉండటానికి నీ భార్యకు అన్నగా, నీకు బావగా వరస కలుపుకున్నాను" అన్నాడు.

ఈ చనువుకు జనార్దనం ఆశ్చర్యపడ్డాడు. "బాగుంది అంతా నీ ఇష్టమేనేమిటి?"

"అనే అనుకోవాలి. అనుకున్న పని పూర్తి చేయడానికి అనుకున్నచోట ఉండడం నా హక్కు" అతను చాలా

నిబ్బరంగా అన్నాడు.

"ఏమిటా అనుకున్న పని?" తీవ్రంగా అడిగాడు జనార్దనం.

"ఏంలేదు. కొన్ని హత్యలు చేయాలి!" చాలా సింపుల్ గా అన్నాడతను.

జనార్దనం తృళ్ళిపడ్డాడు. "మిస్టర్ ఎవరున్నువ్వు?"

"నేనెవరైతేనేం_ నా పేరేమైతేనేం. నన్ను హాంతకుడుగా గుర్తుంచుకుంటే చాలు."

ఈసారి జనార్దనానికి కోపం వచ్చింది. "హత్యలు చేయదల్చుకున్నవాడివి ఇక్కడికెందుకొచ్చావ్? ఏ హోటల్లోనైనా మకాం పెట్టలేకపోయావా?"

"ఎవరికీ అనుమానం రాకుండా అనుకున్న పనులు పూర్తి చేసుకునేందుకు నీలాంటివాళ్ళ ఇళ్ళే బాగా పనికి వస్తాయి. నా పథకాలను నేనెలా అమలుజరుపుతానో నీ కళ్ళతో నువ్వే చూస్తావ్..."

"అయామ్ సారీ, అలా చూడాలని నేననుకోవడం లేదు. నిన్ను నా ఇంట్లో ఉండనివ్వను."

"వెర్రివాడా నిర్ణయం నాదికానీ నీదికాదని మర్చిపోతున్నావ్. నేనుండాలనుకున్నంతకాలం నువ్వొద్దన్నా ఉంటాను. వెళ్ళిపోవాలనుకున్న రోజున నువ్వు కాళ్ళు పట్టుకు బ్రతిమలాడినా క్షణముండను."

"కాళ్ళుపట్టుకు బ్రతిమలాడే రోజు ముందుందేమో నాకు తెలియదుకానీ ప్రస్తుతానికి నిన్ను నేను మెడపట్టి గెంటబోతున్నాను" అన్నాడు జనార్దనం ఒక అడుగు ముందుకువేసి.

"మంచిది" అని ఆగంతకుడు తనూ ఒక అడుగు ముందుకువేసి జనార్దనాన్ని సమీపించి నెమ్మదిగా అతనికి మాత్రం వినిపించేలే "లలితారాణి కథ నాకు తెలుసు!" అన్నాడు.

జనార్దనం ముఖంలో గాబరా కనబడింది. అతను భార్య వంక చూసి "సీతా మంచినీళ్ళు!" అన్నాడు. సీత త్వరగా లోపలకు వెళ్ళింది.

ఆగంతకుడు జనార్దనం భుజంమీద తట్టి "చూడు, అనవసరంగా గాబరాపడకు. నేను నిన్ను బ్లాక్ మెయిల్ చేయడానికి రాలేదు. నీ దగ్గర్నుంచి డబ్బునూ ఆశించడం లేదు. నా పనయ్యేవరకూ నీ ఇంట్లో ఉండనీ" అన్నాడు.

సీత వచ్చి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. జనార్దనం గటగటా మంచినీళ్ళు తాగేశాడు. తర్వాత భార్యవంక చూసి "సీతా చాలా ఆకలిగా వుంది. ఏదైనా టిఫిన్ చేయి. ఏంచేసినా నీ అన్నయ్య మెచ్చుకునేలా ఉండాలి సుమా" అన్నాడు.

సీత తెల్లబోయి భర్తవంక చూసింది. తర్వాత ఆమె నెమ్మదిగా వంటింట్లోకి వెళ్ళింది.

# 3

శాస్త్రగుస్వరంతో జనార్దనానికీ, ఆగంతకుడికీ సంభాషణ నడుస్తోంది.

"ఎన్నాళ్ళుంటావ్? మా ఇంట్లో..." అన్నాడు జనార్దనం.

"ప్రస్తుతం వేసుకున్న అంచనా ప్రకారం రెండునెలలనుకుంటున్నాను. ఒక్కోసారి అంచనాలు తారుమారవుతుంటాయి. వెళ్ళడానికి వారం రోజుల ముందు తెలియబరుస్తాన్లే!" అన్నాడాగంతకుడు.

"ఏమిటి నీ పని!"

"చెప్పానుగా హత్యలు చేయడం!" అన్నా డాగంతకుడు. "నేనేం చేస్తున్నానో నా పనులేమిటో మీరు పట్టించుకోకూడదు. నాకోసం ఒక గది మీరు కేటాయించాలి. రోజూ ఉదయంపూట శుభ్రపర్చడానికి తప్పితే ఆ గదిలోకి మీ రెవ్వరూ రాకూడదు."

జనార్దనం నిట్టూర్చాడు. ఇలా ఒక ఆగంతకుడు వచ్చి తనింట్లో ఏకుమేకై కూర్చుంటాడని అత నెన్నడూ అనుకోలేదు. అతను నిస్సహాయంగా ఆగంతకుణ్ని చూసి "లలితా రాణి కథ నీకెలా తెలుసు!" అన్నాడు.

"నాయనా మాకూ యూనియన్ ఉంది. ఆ యూనియన్లో ఇలాంటి రహస్యాలు కొన్ని లక్షలుంటాయి. అవసరానికి వాడుకుంటూంటాం."

"ఇప్పుడు నువ్వెక్కణ్ణించి వస్తున్నావ్!"

"కోటీశ్వర్రావు తెలుసుగదా నీకు..."

"ఏ కోటీశ్వర్రావు..."

"రైస్ మిల్ ఓనర్..."

"ఓహ్ ఆయనా?" ఉలిక్కిపడ్డాడు జనార్దనం. "ఆయన హత్యచేయబడి ఇంకా వారంరోజులు కాలేదు."

"ఆఁ అదే. ఆ హత్య నేనే చేశాను" అన్నాడు ఆగంతకుడు తాపీగా. "కానీ, దురదృష్టవశాత్తూ అది ఒకడి కళ్ళబడింది. వాడు నన్ను చూశాడు. కోటీశ్వర్రావు హత్య కేసులో అనుమానంమీద ఒకణ్ని అరెస్టు చేశారు. వాడు పాత నేరసుడే. రెండుమూడు హత్యలుచేసి తప్పించుకోగలిగాడు. ఎప్పటికైనా ఉరికంబం ఎక్కవలసినవాడే. ఇప్పుడిలా ఎక్కితే కనీసం నన్ను రక్షించినట్లవుతుంది

గదా అని అనుకున్నాను. అయితే, నన్ను చూసినవాడొకడున్నాడు గదా - వాడి పని పూర్తి చేస్తే కానీ నాకు తృప్తిగా వుండదు. చేసి నన్ను హంతకుడిగా నిరూపించడానికి వాడు ప్రయత్నిస్తాడని నేననుకోవడంలేదు. కానీ ఋణశేషం, శత్రుశేషం వుంచకూడదని పెద్దలంటారు. నా యింట్లో మకాం పెట్టి నేను చేయబోయే మొదటి హత్య అదే!"

జనార్దనం కంగారుపడ్డాడు. ఆ మనిషి చాలా ప్రశాంతంగా వున్నాడు. పిడుగుల్లాంటి మాటలు చాలా సావధానంగా అంటున్నాడు. "మొదటి హత్య అంటే-ఇంకా ఎన్ని హత్యలు చేద్దామని!"

"లెక్క వేసుకోలేదు. ప్రస్తుతానికి మరో మూడున్నాయి లిస్టులో. కానీ, అవసరాన్నిబట్టి మరికొన్ని చేయాల్సి రావచ్చు. ఉదాహరణకు కోటీశ్వర్రావుని చంపినప్పుడు ఆ హత్య ఇంకొకడు చూస్తాడని నేననుకోలేదు. కానీ, ఇంకొకడు చూశాడు. ఒకటనుకున్నది - రెండు హత్యలు చేయాల్సొచ్చింది!" జాలిపడుతున్నట్లుగా అన్నాడాగంతకుడు.

జనార్దనానికి గుండెలదిరాయి. తనజీవితం ప్రమాదంలో పడినట్లతనికి తోచింది. అత నాలోచిస్తూండగా సీత ఉప్మా ప్లేట్లతో వచ్చింది, ఇద్దరూ టిఫి నారగించారు.

"చెల్లాయింత రుచిగా చేసే మాటయితే, నే నిక్కడ ఏళ్ళతరబడి వుండిపోవాల్సొస్తుంది" అన్నాడతను.

జనార్దనా న్నామాటలు మరింత భయపెట్టినా అతను తరచుగా సీతను చెల్లాయనడం కొంత ధైర్యాన్నిచ్చింది. కనీసం ఈ వరసైనా కొంత ఆత్మీయతను కలిగించి ఈ

హంతకుడు తమ జోలికి రాకుండా చేస్తుందని ఆశ కలిగిం దతనికి.

"సీతా-మీ అన్నయ్యకి ఓ గది ఖాళీ చేసివ్వాలి. ఆ ఏర్పాట్లు చూస్తావా? అందుకు నా సాయమేదైనా కావాలా?" అన్నాడు జనార్దనం.

ఆగంతకుడు లేచాడు. "నేను మళ్ళీ రాత్రి ఎనిమిది న్నరకు వస్తాను. అప్పటికన్నీ సిద్ధంగా వుంచండి. నేను కూడా ఆట్టే సామాను తెచ్చుకురావడంలేదు. అందుకని నిత్యావసర వస్తువులకోసం పదేపదే మీ గదుల్లోకి రానవ సరం లేకుండా, హోటల్ గదిలా అన్ని ఏర్పాట్లూ చేయండి. ఒక మంచం, దుప్పటీ, రెండు తలగడలు, కప్పుకోడానికి మరో దుప్పటీ వుంటే పక్కకు సంబం ధించినంతవరకూ ఏర్పాట్లు చాలు. ఓ కూజా, నిండా నీళ్ళు-పక్కనే ఒక గ్లాసు. ఇవికాక అద్దం, దువ్వెన, కొబ్బరి నూనె సీసా, సబ్బు, తువ్వాలు ప్రస్తుతానికి నాకు గుర్తున్న వివే..."

"బ్రష్షూ, పేస్టూ..." అంది మంటగా సీత.

"అవసరంలేదు. అవీ, టంగ్ క్లీనరూకూడా నేనే తెచ్చుకుంటున్నాను. రాత్రికి భోజనంకూడా చేసి వచ్చే స్తాను. నాకోసం మీ రింకే ఏర్పాట్లూ చేయ నవసరం లేదు. వచ్చి తిన్నగా గదిలోకి వెళ్ళి పడుకుంటాను. కానీ, ఒక చిన్న హెచ్చరిక. నా గురించి పోలీసులకి చెప్పడానికి ప్రయత్నించినా, ఏదో విధంగా నన్ను పట్టించడానికి నా మీద డిటెక్టివులని నియమించినా మీ చావు మీరే కొని తెచ్చుకున్నట్లవుతుంది. కోపంవస్తే నాకు దయా దాక్షిణ్యా లుండవు. వస్తాను మరి" అంటూ వెళ్ళిపోయా డతను.

# 4

గది ఒకటి ఖాళీచేసి ఏర్పాట్లుచేస్తున్నంత సేపూ సీ విసుక్కుంటూనే వుంది. "మనం పెద్దిల్లు తీసుకున్నది వీ కోసమేలాగుంది" అందామె కసిగా.

"బాగుంది. వీడికోసమెందుకవుతుంది. కోరి నాకు అర్ధాంగిగా వచ్చిన కోటీశ్వరుడి పుత్రికను ఎలా చూసుకోవాలో నాకు తెలుసు. నాకు తెలిసినవిధంగా చూసుకునే స్తోమత నాకుంది. ఈ ఇల్లు నీ భర్త జీతాన్నీ, హోదానీ చెప్పక చెబుతుంది" అన్నాడు జనార్దనం గర్వంగా.

"మీరు మీ హోదాని గుర్తుచేసుకుని సంబరపడుతున్నారు. నా ఆలోచనలన్నీ వాడిగురించే–వాడు మనింట్లో కొన్ని మాసాలుంటాడంటే నా ఒళ్ళు కంపరమెత్తిపోతోంది. క్షణంకూడా వాణ్ని నేను భరించలేను. పైగా చెల్లాయంటూ పిలుపొకటి. నాకన్నయ్యలు లేకపోవచ్చు కానీ ఇలాంటి వెధవని అన్నయ్యగా భరించడం నావల్ల కాదు. పైగా మీరుకూడా ఆ వెధవతో చేతులు కలిపి మీ అన్నయ్య మీ అన్నయ్య అంటున్నారు" అంది సీత ఉక్రోషంగా.

జనార్దనం సీతవంక బాధగా చూశాడు. "చూడు సీతా మనం విధి చేతిలో కీలుబొమ్మలమన్న సంగతి నీకు పదేపదే గుర్తుచేయనవసరంలేదు. వాణ్ని మనం ఏమీ అనలేము. వాడొక నరరూప రాక్షసుడు. నరహంతకుడు. వాడితో గొడవ పెట్టుకుంటే మనని బ్రతకనివ్వడు. ఇలాంటివాళ్ళను తెలివిగా వదుల్చుకోవాలి."

"పోనీ పోలీసులకి చెప్పేస్తే..."

"విన్నావుగా –– వెళ్ళేముందు వాడి హెచ్చరిక"

అన్నాడు జనార్దనం. "అన్నంతపనీ చేస్తాడు వాడు."

"బాగుంది...అంత్యనిష్ఠూరంకంటె ఆదినిష్ఠూరం మేల న్నాడు. వీణ్నిప్పుడు నెత్తికెక్కించుకుంటే తర్వాత వదుల్చుకోవడం కష్టంకావచ్చు. ఇలాంటివాడితో కల కాలం వేగడమూ కష్టమే కాబట్టి ఏదోక్షణంలో వీడితో గొడవపడకా తప్పదు. అప్పుడైనా వీడు మనల్ని చంపుతా ననకా మానడు. అందుకని బాగా ఆలోచించి ఇప్పుడే వీణ్ని వదుల్చుకునే సాధనం చూడండి" అంది సీత.

"నువ్వు చెప్పిందీ నిజమే" అన్నాడు జనార్దనం. కోటీశ్వర్రావు హత్యను చూసిన నేరానికి ఒకణ్ని చంప బోతున్నట్లు చెప్పాడు వాడు. అలాగే తనకూ కొన్ని రహస్యాలిప్పటికే తెలిశాయి. ముందుముందింకా తెలియ వచ్చు. అటువంటప్పుడు తమను మాత్రం వదిలిపెడతా డన్న గ్యారంటీ ఏమిటి? తలచుకుంటేనే జనార్దనానికి గుండెలు జలదరించాయి. అతను క్షణం ఆలోచించి "సీతా! వీడిని వదుల్చుకోవాల్సింది. కానీ ఆ పని మంచిగానే చేయాలి. ఇలాంటి సమయంలో మీ నాన్నగారిలాంటివాడు మన కండగా ఉండి ఉన్నట్లయితే చాలా బాగుండేది!" అన్నాడు.

సీత కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి. "దయవుంచి ఆయన ప్రసక్తి తీసుకురాకండి. నాకో తండ్రి వున్నాడని గుర్తుచేయకండి. ఇంకే ఉపాయాలైనా ఆలోచించండి" అంది.

జనార్దనం నిట్టూర్చాడు. సీత తండ్రి శంకర్రావు కోటీ శ్వరుడు. సీత ఆయన ఏకైక సంతానం. సీత తనను ప్రేమించడం ఆయన కేమాత్రమూ ఇష్టంలేదు. కానీ

ఆయన ఇష్టాన్ని వ్యతిరేకించింది సీత. తనమాట కాదం ఇంట్లోంచి పొమ్మన్నాడామెను. అలాగేనని తనతో వ[illegible]సింది సీత. గుళ్ళోనే అయినా తమ వివాహం వైభవం జరిగింది. వివాహమైన ఆర్నెల్లకు సీత తండ్రి ఆమె దరకు వచ్చి ఆమె జీవితం చూసి బాధపడ్డాడు. జనార్ద[illegible]నికి విడాకులిచ్చేస్తే ఆమెకు ఒక గొప్పవాడితో మ[illegible] వివాహం జరిపిస్తానన్నాడు. ఆమె జీవితాన్ని సుఖమయ[illegible] చేయాలన్నది తన తపన అన్నాడు. ఆమె ఆయన మాట[illegible] వినకపోయేసరికి జనార్దనాన్ని చంపిస్తానని బెదిరించాడు. సీత రెచ్చిపోయి 'నా భర్త మరణించిన మరుక్షణం నేను శవంగా మారుతానన్న సంగతి మీరు గుర్తుంచుకోండి మిమ్మల్ని... ఈ మాటలన్న మిమ్మల్ని... ఇంక నాన్నా అని పిలవలేను. వెళ్ళిపోండి. ఇంకెప్పుడూ నన్ను కలుసుకునేందుకు ప్రయత్నించకండి" అనేసింది.

అప్పటికి జనార్దనం సామాన్యమైన ఉద్యోగం చేస్తున్నాడు. కానీ శంకర్రావు సీత జీవితం చూసి జాలిపడడం అతనికి తల తీసేసినట్లయింది. అతను కష్టపడి మంచి ఉద్యోగం కోసం నానాప్రయత్నాలూ చేయసాగాడు. ఆ సందర్భంలోనే అతనికి లలితారాణి పరిచయమైంది. పరిచయం ఊరికేపోలేదు. అతనికొక పెద్ద కంపెనీలో పదిహేనువందల రూపాయల జీతంమీద ఉద్యోగం దొరికింది. అప్పట్నించీ అతను సీతను సుఖపెట్టడమే ధ్యేయంగా ఉంటున్నాడు. ఇది జరిగి సంవత్సరానికి పైగా అయింది.

సీత కోటీశ్వరుడి ఇంట పుట్టినప్పటికీ, ఆమె విలాసవతి కాలేదు. ఆమెకు చెడుఅలవాట్లు లేవు. ఆమె కోరుకునేది

మనసారా ప్రేమించే మనుషులను. మోసం, ద్వేషం అన్న పదాలామె కామడదూరంలో ఉంటాయి. ఆమె దుబారా ఖర్చులు చేయదు. అవసరానికి మించిన పనివాళ్ళను పెట్టుకోలేదు. చిన్నతనంనుంచీ అలవాటైన కారణంగా ఆమె తనకో రకమైన యిల్లు కోరుకుంది. ఆ యింటి నామె స్వయంగా అందంగా అలంకరించి ఉంచుతుంది.

జనార్దనానికి సీతతో కాపురం చాలా హాయిగా వుంటోంది. భౌతికంగాను, మానసికంగానూ అందమైన భార్య లెంతోమంది మగవాళ్ళకు లభించరు. చక్కగా నడిచిపోతుందన్న జీవితంలోకి, ఈరోజే ఒక దుర్మార్గుడు ప్రవేశించాడు. వాడి పీడ ఎలాగో అలా వదలించుకోవాలి?

"ఈ రాత్రికి వాడెలాగూ ఇక్కడుండడం తప్పదు' రెండుమూడ్రోజుల్లో ఏదో ఒక పథకం వెయ్యాలి. తెలివిగా వాడిని బయటకు పంపించాలి......" అన్నాడు జనార్దనం.

జనార్దనం ఆలోచనలు ఒక రూపానికి వస్తున్నాయి.

ఇద్దరూ భోజనాలుచేసి హంతకుడి రాకకోసం వీధి గదిలో కూర్చుని ఎదురుచూస్తున్నారు. అన్న టైముకి ఠంచనుగా వచ్చాడు హంతకుడు. అతని చేతిలో ఒక సూట్ కేస్ మాత్రం వుంది. లోపలికి వస్తూనే అతను వుత్సాహంగా "చెల్లాయ్ మీ భోజనాలైపోయాయా? నీ చేతి ఉప్మా రుచిచూశాక భోజనం కూడా ఇక్కడే చేయాలనిపించిందమ్మా! కానీ ఈరోజుకు నాకా అదృష్టం లేదు" అని అతను హఠాత్తుగా దీనంగా అయిపోయాడు. "జీవితంలో నాకెవ్వరూ లేరు. అభిమానాలకూ, ఆప్యాయతలకూ నోచుకోలేదు. ఎందుకో నిన్ను చెల్లాయని పిలు

స్తూంటే అంతులేని ఆనందం కలుగుతోంది. ఏదో జన్మాను బంధముండి ఉండాలి మనిద్దరకూ."

అతని మాటలకు సీత చలించింది. రవంత అతని మీద జాలికూడా కలిగింది. జనార్దనానికి మాత్రం అతనటిన్నించి నరుక్కువస్తున్నాడని అర్థమైపోయింది. సీతను నెమ్మదిగా మంచి మాటలతో లోబరచుకుని ఈ ఇంట్లో తన స్థానాన్ని పటిష్ఠం చేసుకుందామనుకుంటున్నాడని గ్రహించాడతను.

"నీకు గది సిద్ధమైపోయింది" అన్నాడు జనార్దనం.

"అయితే ఇప్పుడు నా ప్రయాణం సరాసరి గదిలోకే_ దారి చూపిస్తావా?" అన్నాడు హంతకుడు. జనార్దనం ముందుకు నడుస్తూంటే హంతకుడు వెనుక నడిచాడు. సీత వెళ్ళి వీధి తలుపులు వేసింది. ఆమె కూడా హంతకుడి కేర్పాటుచేసిన గదిలోకి వెళ్ళేసరికి హంతకుడు గదిని చూసి సంతృప్తిని వ్యక్తపరుస్తున్నాడు.

"చాలా బాగుంది_ నాకింక మీతో ప్రమేయంలేదు. ఈ గదితలుపులు దొడ్లోకివున్నాయి కాబట్టి పగలు నేనలా దొడ్డి వేపు తలుపులు వేసుకుని వెళ్ళిపోవచ్చు. ఎటొచ్చీ మీ రనవసరపు టనుమానాలేమీ పెట్టుకోకుండా రాత్రిళ్ళు కూడా, దొడ్డితలుపులు గడియ వేయకుండా జార్లవేసి మాత్రం వుంచండి" అన్నాడు హంతకుడు.

"అలా చేయడం ప్రమాదం. ఈ ఊళ్ళో దొంగల భయం బాగా ఎక్కువ" అన్నాడు జనార్దనం.

"నేనుండగా నీకూ, చెల్లాయికీ ఏం భయంలేదు బావా_ధైర్యంగా వుండండి. ఎవరైనా ఈ ఇంట్లో అడుగు పెట్టారో వాళ్ళ గతి ఏమవుతుందో తెలుసుకోవాలంటే చూడండి" అంటూ అతను తన సూట్ కేస్ ఓపెన్

చేశాడు. సీత, జనార్దనం కుతూహలంగా చూశారు. సీతకు సంబంధించినంతవరకూ ఒక రివాల్వర్, 'కత్తి కనబడ్డాయి. జనార్దనా న్నాకర్షించిన మూడో వస్తువులో సీతకు ప్రత్యేకత కనబడలేదు.

అది లలితారాణి ఫొటో!

# 5

మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో సీత, ఎవరో తలుపుతట్టిన చప్పుడు విని, వెళ్ళి తలుపులు తీసింది. ఆ ఆగంతకుడెవరో ఆమెకు తెలియలేదు.

"మీ ఇల్లు సోదాచేయాలి!" అన్నాడతను.

"ఎవరు మీరు?" అంది సీత.

"అది మీ రడగకూడదు_నేను చెప్పకూడదు" అన్నాడతను.

"అయితే నేనసలు తలుపులు తియ్యనే తియ్యకూడదు" అంటూ అతను వీధిగుమ్మంలో వుండగానే తలుపులు వేసేయబోయింది సీత.

"ఆహా_ఆగండి" అంటూ అతను బలవంతంగా లోపలకు వచ్చి, "నేను ప్రమాదకరమైన వ్యక్తినీ కాదు, దొంగనూ కాదు. ఒక ముఖ్యమైన విషయంలో ఈ వీధిలోని ఇళ్ళన్నీ సోదాచేస్తూ మీ ఇంటికీ వచ్చాను" అన్నాడు.

"బాగుంది _ అలాగైతే మీరు సాయంత్రం రండి. అప్పుడు నా భర్త ఇంట్లో వుంటారు" అంది సీత.

"సాయంత్రందాకా ఆగడానికి వీల్లేదు. ఇప్పుడే అర్జంటుగా సోదాచేయాలి" అంటూ అతను చాలా కంగారుగా లేచి లోపలకు వెళ్ళబోయాడు.

"లోపలకు వెళ్ళవద్దు-దొంగ దొంగ అని పెద్దగా అరుస్తాను..." అంది సీత.

"అరుస్తావేం?...అరిస్తే చస్తావ్" అతను హఠాత్తుగా చిన్న చాకు తీశాడు.

సీత నిర్వీర్యపోయింది. ఒక్క క్షణంలోనే తమాయించుకుని, "ఏమిటీ దౌర్జన్యం - ఇంట్లో మగవాళ్ళు లేరనుకుంటున్నావేమో, మా అన్నయ్యున్నాడు" అంది. ఆ క్షణంలో హంతకుడామె కాపద్బాంధవుడిలా తోచాడు.

"ఉన్నాడా - ఉంటే మరీ మంచిది. నా పని మరింత సుకరమవుతుంది" అన్నాడతను.

"అయితే చేసుకో నీ పని సుకరం, నేను వచ్చాను" అన్న మాటలు విని ఉలిక్కిపడి ఇద్దరూ అటువైపు చూశారు. హంతకుడక్కడ నిలబడి నవ్వుతున్నాడు.

కొత్త ఆగంతకుడు చాకును జేబులో పడేసుకుని, "ఇలా వచ్చి కూర్చోండి - మీతో రెండు ముక్కలు మాట్లాడాలి" అన్నాడు.

"చిత్తం - అలాగే చేస్తాను" అంటూ హంతకుడు వెళ్ళి కుర్చీలో కూర్చున్నాక ఆగంతకుడుకూడా తనూ ఇంకో కుర్చీలో కూర్చుని, "మీ ఇల్లు సోదాచేయాలి? ఆ విషయం అంగీకరించకపోవడంవల్లనే మీ చెల్లాయిని చాకు చూపించి బెదిరించాల్సి వచ్చింది" అన్నాడు.

"ఎందుకు మా ఇల్లు సోదాచేయడం? ఇల్లు సోదా చేస్తామంటే ఎవరుమాత్రం ఒప్పుకుంటారు? చెల్లాయి రైటే చేసింది. మీ రెవరో మీ పని ఏమిటో చెప్పండి..." అన్నాడు హంతకుడు కాస్త తీవ్రంగా.

"చెప్పక తప్పేలాలేదు" అన్నాడా ఆగంతకుడు.

"ఈ వీధిలో ఒక నరహంతకుడు మకాం పెట్టినట్లు మాకు సమాచార మందింది. వాడు పరమ దుర్మార్గుడు. వాడి నెలాగో అలా పట్టుకోవాలని శతవిధాలుగా ప్రయత్నిస్తున్న మాకీ సమాచారం అదృష్టవశాత్తూ లభించింది."

"అలాగా – అయితే ఈ ఇల్లు మీరు సోదా చేయడం అనవసరం. ఆ మకాం చేసేవాడు మాకు తెలియకుండా యిక్కడుండడు కదా" అన్నాడు హంతకుడు.

"అలాగనకండి–ఒకోసారి అనుకోకుండా సమాచారం లభించవచ్చు. ఉదాహరణకు మీ రీవిడకు అన్నయ్య నంటున్నారు. కానీ కాకపోవచ్చు. ఈవిణ్ణి బెదిరించి ఈ ఇంట్లో ఉంటూండవచ్చు" అన్నాడా ఆగంతకుడు.

ఈ మాటలు వింటూనే సీత కళ్ళు మెరిశాయి. దేవుడు తమ మొర విని ఈ మనిషిని పంపించాడా అనుకుందామె. అతనికి నిజం చెప్పి హంతకుడి బారినుంచి తప్పించుకోవాలనుకుందామె. అయితే వెంటనే ఆ పని చేయడానికి ధైర్యం చాలలేదు.

"ఇంతకీ తమరెవరు స్వామీ!" అన్నాడు హంతకుడు.

"ప్రభుత్వ ఇంటెలిజెన్సు శాఖ మనిషిని!" అన్నాడతను.

"ఓహో – తమరు సీ. ఐ. డీ. అన్నమాట" అంటూ హంతకుడు నవ్వి, "నాకూ సమాచారం వచ్చింది. ఈ మధ్య ఓ దొంగ బయల్దేరాడట. సీ. ఐ. డీ. నని చెప్పి ఇళ్ళలో చొరబడి అందినవి పట్టుకుని పోతున్నాడట!" అన్నాడు.

సీ. ఐ. డీ. ముఖం ఇబ్బందిగా పెట్టి, "ఏది యేమైనా నేను వచ్చిన పని ముగించకుండా వెళ్ళను. మీరు నన్నాప

లేరు'' అంటూ కుర్చీలోంచి లేచాడు.

''నన్ను మీరూ ఆపలేరు. ముందు మీ ఐడెంటిఫికేషన్ చూపించనిదే నేను మిమ్మల్ని అడుగు ముందుకు వెయ్యి నివ్వను సరికదా – పోలీసులకు పట్టిస్తాను'' అన్నాడు హంతకుడు.

''నన్ను పోలీసులకు పట్టివ్వడమా. అది మీవల్ల కాదు. అంతగా అవసరమనుకుంటే మీ యిల్లు సోదా చేయడానికి పోలీసుల్నే సాయంగా పిలవగలను'' అన్నాడు సీ. ఐ. డీ.

''అలాగా–అయితే మరి నన్ను సాయంగా పిలవలేదేం?'' అన్నాడు వెటకారంగా హంతకుడు.

''మీరు పోలీసు మనిషి కాదు గదా.''

''నేనెవరో ఇది చూసి తెలుసుకోండి'' అంటూ హంతకుడు సీ. ఐ. డీ. కి ఒక కార్డు చూపించాడు. సీ. ఐ. డీ. అది చూసి తొట్రుపడి, ''అయితే మీరూ, నేనూ కొలీగ్సన్నమాట. అయితే ఇంకేం–మన పని మరింత సుకర మవుతుంది!'' అన్నాడు.

కార్డు తిరిగి జేబులోకి తోసేసి, ''మనమిద్దరమూ కొలీగ్సు కావచ్చు. కానీ, నాకు సంబంధించినంతవరకూ ఈ వీధిలో హంతకుడు మకాం పెట్టిన వార్త డిపార్టు మెంటుకు వచ్చినట్లు తెలియదు'' అన్నాడు.

''వచ్చింది లెండి. కానీ, మీరున్న ఇల్లు సోదా చేయ డం అనవసరం'' అంటూ వెళ్ళిపోయాడు సి. ఐ. డీ.

అతను వెళ్ళిపోయాక హంతకుడు సీతకేసి చూసి నవ్వి, ''చెల్లాయ్–నిజంగా నేను పోలీసుమనిషి ననుకునేవు. ఆ వచ్చిన వెధవని బెదరగొట్టి పంపడానికి నే నాడిన నాటకం. ఇలాంటి నాటకా లెన్నాడితే, నా రహస్యాలు

దాచగలను? ఇంతకూ నీకు నిజం తెలిసిందో లేదో, ఆ వచ్చినవాడు సీ. ఐ. డీ. కాదు. ఆ పేరుతో వచ్చిన దొంగ వెధవ. నేను లేకుంటే ఇల్లు దోచివెళ్ళి పోయుండేవాడు" అన్నాడు.

నిజమే ననిపించింది సీతకు. వాడు తన్ను బాకు చూపి బెదిరించాడుకూడా. కాంతయ్యడిమీద మరికా స్త గౌరవం కలిగింది సీతకు.

## 6

జనార్దనం ఇంట్లో అడుగుపెట్టగానే, "రా-బావా!" అన్నాడు కాంతయ్యడు.

జనార్దనం యిబ్బందిగా ముఖంపెట్టి, "నువ్వింకా యింట్లోనే వున్నావా?" అన్నాడు.

"అయ్యో - అన్నప్రకారం ఇంకా నేను వెళ్ళవలసిన టైము రాలేదే? ఈ ఇంట్లో నేను అన్నకంటె యెక్కువే కానీ, తక్కువరోజా లుండదల్చుకోలేదు" అన్నాడు కాంతయ్యడు.

"అదే నాకూ సంతోషం" అన్నాడు జనార్దనం అదోలా.

"అందుకే-అందుకే. దొరక్క దొరక్క నాకో చెల్లీ, బావా దొరికారు. ఇంకే విధంగానూ చేతకాకపోయినా ఇలాగైనా మిమ్మల్ని సంతోషపెట్ట గలుగుతున్నాను" అన్నాడు కాంతయ్యడు.

జనార్దనం కాంతయ్యడితో యేం మాట్లాడకుండా, "సీతా!" అని అరిచాడు.

"వస్తుందిలే బావా! చాలా భయపడింది తనీ రోజున" అన్నాడు కాంతయ్యడు.

''ఏం జరిగింది?'' జనార్దనం కంగారుగా అడిగాడు.

జరిగింది చెప్పడం హంతకుడు ముగించేసరికి సీత వచ్చి, ''పొరుగింటావిడతో కబుర్లు చెబుతున్నాను. మీరు వచ్చి నట్లే తెలియలేదు'' అంది.

''మధ్యాహ్నం మనింటికి సీ. ఐ. డీ. వచ్చేడా?'' అనడిగేడు జనార్దనం.

''వాడు సీ. ఐ. డీ. ఏమిటి బావా - ఎవడో దొంగ వెధవ. అయినకాటికి అంకించుకుందామని వచ్చాడు. నే నుండడంతో వాడి ఆటలు సాగలేదు'' అన్నాడు హంతకుడు.

జనార్దనం హంతకుడి వంక ఆశ్చర్యంగా చూసి, ''నీకు భయంగా లేదూ, ఒకవేళ వాడు నిజంగా సీ. ఐ. డీ. యేమోనని! వాడు సీ. ఐ. డీ. అయుంటే నువ్వు పట్టుబడే అవకాశా లింకా పెరిగిపోయినట్లు లెక్క!'' అన్నాడు.

హంతకుడు నవ్వి, ''వాడెవరో, ఎందుకొచ్చాడో నాకు వివరంగా తెలుసు!'' అన్నాడు.

''టిఫినేం చేయమంటారు?'' అంది సీత.

''ఈరోజు నీ వంట చవిచూశాను చెల్లాయ్! నువ్వడగక్కర్లేదు. ఏం చేసినా బాగానే వుంటుంది'' అన్నాడు హంతకుడు.

''పకోడీలు వేస్తాను'' అని ఇద్దరివంకా అనుమతికోసం చూసి అక్కణ్ణించి వెళ్ళిపోయింది సీత.

''ఎవరంటావు వాడు?'' కుతూహలంగా అడిగాడు జనార్దనం.

''నిజంగా తెలియకుండానే అడుగుతున్నావా?'' ఆదోలా అన్నాడు హంతకుడు. ''సరే-అయినా అడిగావు

కాబట్టి చెబుతున్నాను. వాడు నువ్వు నన్ను బెదరగొట్టాలని పంపిన మనిషి..."

"అబద్ధం" అన్నాడు జనార్దనం వెంటనే. కానీ, అతని ముఖంలో భయం స్పష్టంగా కనబడుతోంది.

"బుకాయించవద్దు. అన్నీ నేనూహించగలను. నిన్న నేను మీ యింట్లో మకాం పెట్టాను. ఈరోజు మీ ఇంట్లో హంతకుణ్ణి వెతుక్కుంటూ సీ. ఐ. డీ. వచ్చాడు. వెంటనే గ్రహించాను నేను-ఇది నీ పనయ్యుంటుందని. సీ. ఐ. డీ. ల కనుమానం తగిలిందని తెలిస్తే, బెదిరిపోయి పారిపోతా ననుకున్నావు. కానీ, నేను నువ్వూహించిన రకం మనిషిని కాదు" హంతకుడు ఆగి, "నేను మొదట్లోనే నిన్ను హెచ్చరించాను. నన్ను రెచ్చగొట్టడం ప్రాణాలతో చెలగాటమేనని" అన్నాడు.

జనార్దనం మరింత భయపడ్డాడు. అతను నెమ్మదిగా, "పొరబాటయింది" అన్నాడు తల వంచుకుని.

"పొరపాటున ఉప్పు పాలలో పడితే, విరిగిన ఆ పాలను మళ్ళీ అతికించడం కష్టం. పొరపాటున విషం మింగితే, పోయిన ఆ ప్రాణాలింక తిరిగిరావు. నా విషయంలో పొరపాటు చేయడం అంతకంటె ప్రమాదకరం. అయినా నీ మొదటి తప్పును క్షమించాను. ఎటొచ్చీ, ఇంక క్షమించను."

జనార్దనం తల వంచుకునే, "నేను వివరాలేమీ చెప్పలేదు. మా ఇంటికి వెళ్ళి ఈ మాటలు చెప్పి రమ్మన్నాను. మా యింట్లో హంతకుడున్నాడని అతనికి చెప్పలేదు" అన్నాడు.

"మంచిది. లలితారాణి మనిషికి అంతకంటె ఎక్కువ

సమాచార మివ్వడం మంచిపని కాదు!'' అన్నాడు హంతకుడు.

ఆశ్చర్యంగా చూశాడు జనార్దనం అతనివంక - యెవరితను? ఇన్ని వివరాల నెలా సంపాదించగల్గుతున్నాడు?

# 7

''వాడు మీరు నియమించిన మనిషా? వాడు బాకు తీసేసరికి నాకెంత భయంవేసిందో చెప్పలేను. సమయానికి మన అతిథి ఆపద్బాంధవుడిలాగొచ్చా డనిపించింది'' అంది ఆశ్చర్యంగా సీత.

''హంతకుణ్ణి వదిలించుకుందామని నేను వేసిన మొదటి ప్లాను భగ్నమయింది. అతను నన్ను చాలా తీవ్రంగా హెచ్చరించాడు. ఇలాంటి పొరపాటు మళ్ళా జరిగితే ప్రాణాలు దక్కవని చాలా గట్టిగా చెప్పాడు'' అన్నాడు జనార్దనం నిట్టూరుస్తూ.

''ఇంక మనం వాడి జోలికి వెళ్ళవద్దండీ. హంతకుడి నంటున్నప్పటికీ మనిషి మంచివాడిలాగే కనిపిస్తున్నాడు. ప్రవర్తనకూడా మెచ్చుకోదగ్గ విధంగా వుంటోంది. తనెవరైతేనేం - ఏంచేస్తేనేం - మన జోలికి రానంతకాలం, వాడి జోలికి మనమూ వెళ్ళవద్దు'' అంది సీత.

''అవుననుకో. కానీ, ఇంట్లో తిరుగుతున్న పాము ఏదో రోజున మననీ కాటువేయదని నమ్మకమేమిటి?'' అన్నాడు జనార్దనం.

''అదీ నిజమే కానీ, వాడసలు పామే కాదేమో! తను నిజంగా సీ. ఐ. డీ. యేమో. ఆ పేరుతో వుండడం ఇష్టం లేక, హంతకుడన్న పేరుతో మనింట్లో వుండదల్చుకున్నాడేమో. మనిషినీ, మనిషి ప్రవర్తననూ గమనిస్తూంటే,

ఏదో సదుద్దేశ్యంతో మనింట్లో మకాం పెట్టినట్టుంది తప్పితే మరోవిధంగా అనిపించడంలేదు నాకు" అంది సీత.

జనార్దనం ఆశ్చర్యంగా భార్య ముఖంలోకి చూసి, "మొత్తానికీ హంతకుడు అసాధ్యుడిలాగున్నాడు. నిన్ను బుట్టలో వేసుకున్నాడు" అన్నాడు.

భార్యాభర్తలిద్దరూ రాత్రి పన్నెండు గంటలవరకూ మెలకువగానే వున్నారు. ఇంట్లోవున్న హంతకుడు వాళ్ళకు మనఃస్థిమితం లేకుండా చేశాడు. దాంతో వాళ్ళకు నిద్ర పట్టడంలేదు. టైము పన్నెండయేసరికి ఇంక లాభంలేదని మాట్లాడుకోవడం మానేసి ఇద్దరూ కళ్ళు మూసుకున్నారు. కానీ, యిద్దరికీ నిద్రవచ్చే సూచనలు కనబడలేదు.

ఉన్నట్లుండి జనార్దనానికి ఒక ఆర్తనాదం, చావుకేక లాంటిది వినబడింది. చటుక్కున సీత అతనికి మరింత దగ్గరగా జరిగింది. "నీకూ వినిపించిందా ఆ కేక?" అన్నాడు జనార్దనం.

"మీరూ మెలకువగానే వున్నారా?" అంది సీత.

"ఊఁ...ఆ కేక మనింట్లోంచే వచ్చింది. ఒకసారి లేచి చూద్దామా?" అన్నాడు జనార్దనం.

"వద్దండీ" అంది భయంగా సీత.

జనార్దనం లేచాడు. "ఏమిటో చూడాల్సిందే - నీకు భయంగా వుంటే నువ్వు రాకు."

"అమ్మో - ఒక్కర్తికీ భయం నాకు. నేనూ మీతో వస్తాను" అంది సీత.

ఇద్దరూ లేచారు కానీ, గదిలో లైటు వేయలేదు. చప్పుడు కాకుండా తమ గదితలుపులు తీశారు...

హంతకుడి గదితలుపులు బార్లా తెరచివున్నాయి.

గదిలో మంచంమీద ఒకమనిషి వెల్లకితలా పడివున్నాడు. అతని గుండెల్లో కత్తి దిగబడివుంది. ఆ ప్రాంతమంతా ఎర్రగా వుంది. మనిషి అప్పటికే చచ్చినట్లున్నాడు. ఎక్కడా చలనంలేదు. హంతకుడు గదిలో లేడు.

సీత వణికిపోతోంది. జనార్దనం ఆమె వీపు నిమిరాడు కంగారు పడవద్దన్నట్లుగా. అంతలో యిద్దరికీ అడుగుల చప్పుడు వినపడి చీకట్లోకి తప్పుకున్నారు.

హంతకుడు దొడ్డివైపునుంచి గదిలోకి వచ్చాడు. అతను శవాన్ని పరీక్షగా చూసి తృప్తిగా నిట్టూర్చాడు. మనిషి ముఖంలో కసి కనబడుతోంది. చూడ్డానికతను నిప్పుడు భయంకరంగా వున్నాడు.

హంతకుడి గదిలో ఇప్పుడొక ట్రంకుపెట్టె వుంది. హంతకుడు దాని మూత తెరిచాడు. అది చాలా పెద్దసైజు పెట్టె. ఖాళీగా వుంది. హంతకుడు శవాన్ని సమీపించి కాళ్ళు ముడవడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇంక అక్కడుండడం ప్రమాదమని తోచింది జనార్దనానికి. అడుగులచప్పుడు కాకుండా యిద్దరూ అక్కణ్ణించి నెమ్మదిగా తమ గదిలోకి జారుకున్నారు. గది తలుపులు వేసుకుని మంచంమీద పడుకున్నాక, "నాకు చాలా భయంగా వుంది" అంది సీత.

"భయపడకు. హంతకుడి అసలు స్వరూపం చూశా విప్పుడు నువ్వు - నే నెప్పుడో ఊహించాను" అన్నాడు జనార్దనం.

"ఆ మనిషెవరో పాపం - మనింటి కెప్పుడొచ్చాడో - ఎందుకొచ్చాడో - ఇక్కడిలా అర్థాంతరంగా చావాలని రాసిపెట్టి వుంది" అంది సీత.

"నా అభిప్రాయంలో - హంతకుడే అతన్ని మనింటికి పిల్చుకువచ్చి వుండాలి" అన్నాడు జనార్దనం.

"అంటే హంతకుడికి బాగా తెలిసినవాడై వుండాలి!" అంది సీత.

"హంతకుడికే కాదు. ఆ చనిపోయిన మనిషి నాకూ తెలుసు!" అన్నాడు జనార్దనం. అతని కంఠం బాధగా వుంది.

"ఎవరండీ అతను!" కుతూహలంగా అడిగింది సీత.

"అతని పేరు అనంతం. చాలా చలాకీ అయినవాడు. అప్పుడప్పుడు నాకు క్లబ్బులో కలుస్తూండేవాడు. అనంతానికి హంతకుడితో పరిచయ మెలాగయిందో మాత్రం నాకు తెలియదు..." అన్నాడు జనార్దనం.

"పేపర్లలో హత్యల గురించి చూడ్డమే కానీ, ఇలా కళ్లెదుట ఒక హత్యను చూస్తానని అనుకోలేదు" అంది సీత. ఆమె ఇంకా వణుకుతున్నదని స్పర్శనుబట్టీ, మాటలనుబట్టీ జనార్దనం గ్రహించాడు.

జనార్దనం భార్యను దగ్గరగా లాక్కుని, "జాగ్రత్త! మనకేం భయంలేదు. కానీ, ఈ హత్యను చూసినట్లు పొరపాటునకూడా ఎవ్వరికీ తెలియకూడదు. ముఖ్యంగా హంతకుడికి..."

"ఏం?" అంది సీత.

"హత్య చూసినవాళ్లెవ్వరూ బ్రతికి బయటపడడం హంతకుల కిష్టముండదు" అన్నాడు జనార్దనం. అతను హఠాత్తుగా ఉలిక్కిపడ్డాడు. "ఓహ్-అందుకే యితన్ని చంపేశాడేమోకూడా" అన్నాడు.

సీత కర్థంకాలేదు. "ఏమిటండీ మీ రనేది?" అంది.

"రైస్ మిల్ ఓనర్ కోటీశ్వరరావు హత్య చేయబడ్డాడు. ఆ హత్య మనింట్లో వుంటున్న హంతకుడే చేశాడట. తనే చేశానని వాడు నాకు స్వయంగా చెప్పాడు. ఆ హత్యను ఒకడు చూశాడనీ, వాణ్ణి తను చంపేయదల్చుకున్నాననీకూడా హంతకుడు నాతో అన్నాడు. అనంతానికి కోటీశ్వర్రావుతో పరిచయముంది. అతను తరచుగా కోటీశ్వర్రావింటికి వెడుతూంటాడు. బహుశా అతనే హత్యను చూసివుంటాడు. అందుకే ఈరోజు మనింట్లో అంత మైపోయాడు."

"అయితే మనమూ చూశామిప్పుడు ఒక హత్య."

"అందుకే ఈ విషయం రహస్యంగా వుంచాలి. ఎవ్వరికీ తెలియనివ్వకూడదు. తెలిస్తే అనంతానికి పట్టిన గతే మనకూ పట్టవచ్చు" అన్నాడు జనార్దనం.

# 8

"చెల్లాయ్ పాత దుప్పట్లు పోయాయి. ఈ రోజు నా గదిలో కొత్త దుప్పట్లు మార్చాలమ్మా" అన్నాడు హంతకుడు.

"మీ చెల్లాయ్‌కి జ్వరం వచ్చింది" అన్నాడు జనార్దనం.

హంతకుడి ముఖంలో కంగారు కనబడింది. అతను చటుక్కున ఒక అడుగు ముందుకు వేసి ఆమె నుదుటి మీద చేయివేసి చూసి "అరే నుదురు కాలిపోతోంది. వెంటనే డాక్టర్ని పిలుచుకురా బావా!" అన్నాడు.

"అవును నేనూ ఇప్పుడే లేచి తలుపులు తీశాను. నువ్వు వచ్చావు" అన్నాడు జనార్దనం ముక్తసరిగా.

"రాత్రిదాకా బాగానేవుంది. ఇంతట్లో ఏమయింది.

ఏమైనా చూసి జడుసుకుందేమిటి?" అన్నాడు హంతకుడు.

జనార్దనం ఉలిక్కిపడి హంతకుడి కళ్ళలోకి చూశాడు. అతని కళ్ళలో అనుమానమూ, సన్నని ఎరుపు జీర కనబడుతున్నాయి. "అబ్బే అటువంటిదేమీ లేదు. అయినా ఈ యింట్లో జడుసుకునేందుకేముంది — నువ్వు తప్ప!" అన్నాడు.

"అదే అదే నన్ను కానీ, నా..." అర్ధాంతరంగా ఆగాడు హంతకుడు.

"నేను వెళ్ళి డాక్టర్ని పిలుచుకు వస్తాను. పని మనిషి వస్తే ఈలోగా కాస్త గిన్నెలు వేసి పెట్టు" అన్నాడు జనార్దనం.

డాక్టరు వచ్చి చూసి కంగారు పడవలసిందేమీ లేదనీ దేనికో భయపడినట్లు కనబడుతోందనీ అన్నాడు. డాక్టరు మాటలు విన్నాక హంతకుడి కళ్ళలో మరింత అనుమానం కనబడడం చూసి కలవరబడ్డాడు జనార్దనం. ఏవో టాబ్లెట్సిచ్చి డాక్టరు వెళ్ళిపోయాక "రాత్రి మీకేదైనా కేక వినపడిందా?" అనడిగాడు హంతకుడు.

"నాకు ఒళ్లు తెలియని నిద్ర పట్టేసింది. ఏ కేకలూ వినలేదు. ఏమలా అడుగుతున్నావ్?" అన్నాడు జనార్దనం ఎరగనట్లుగా.

"ఏమీ లేదు. నిద్రలో కలవరించడం నాకు బాగా అలవాటు. ఒకోసారి పెద్ద పెద్ద కేకలు కూడా పెడుతూంటానట. అలాంటి దేదైనా విని చెల్లాయ్ భయపడిందేమోనని..." అన్నాడు హంతకుడు.

"లేదన్నయ్యా అలాంటి కేకలు నా చెవుల పడవు. నాది మరీ మొద్దునిద్ర" అంది సీత.

"బావా మీయింటి నుంచి నది ఒడ్డుకు రిక్షా ఏం తీసుకుంటాడు?" అనడిగాడు హంతకుడు.

"ఎందుకు?" జనార్ధనం అడిగాడు.

"ఓ రిక్షా బేరమాడిపెట్టాలి. నేనూ ఒక ట్రంకుపెట్టీ ఉంటాయని చెప్పు. ఓ పావలా డబ్బులు ఎక్కువైనా ఫరావాలేదు. ఈ రోజు మళ్ళీ సాయంత్రందాకా రాను" అన్నాడు హంతకుడు.

అతను వెళ్ళడం చాలా అవసరమని తోచి తక్షణం పరుగెత్తుకు వెళ్ళాడు జనార్ధనం. క్షణాలమీద రిక్షా కుదుర్చుకుని కూడా వచ్చాడు.

హంతకుడు. జనార్ధనం కలిసి ట్రంకును మోసి రిక్షాలో పెట్టారు. మోయడం చాలా కష్టమయింది. అది చాలా బరువుగా వుంది. రిక్షా వెళ్ళిపోయేక జనార్ధం భార్య దగ్గరకు వచ్చి ఆమె పొట్టమీద చేయి వేసి చూశాడు. ఇంకా వేడిగానే ఉందామె ఒళ్ళు.

"జడుసుకున్నావా సీతా!" అన్నాడతను.

"ఏమోనండీ రాత్రి శవాన్ని చూసేక నాకు చాలా భయం కలిగినమాట నిజం. జడుసుకున్నానని అనుకోలేదు" అంది సీత.

"ఎలాగైనా హంతకుడు మనకు చాలా ప్రమాదకారిలా గున్నాడు. వీడితో మనకు క్షణక్షణగండమే వీణ్ణి బయటకు పంపడానికేదైనా ఉపాయం పన్నాలి. అదీ తిరుగులేనిది" అన్నాడు జనార్ధనం.

"ఏమో వీణ్ణి వదుల్చుకోగలమని నాకు నమ్మకం కలగడం లేదు" అంది సీత భయంగా.

"ఈ రోజుకి ఆఫీసుకి సెలవు పెట్టేస్తాను. హంతకు

డెలాగూ సాయంత్రం వరకూ రాడు. వాడొచ్చేలోగా మనం మంచి పథకం వేయాలి" అన్నాడు జనార్దనం. అతనాప్యాయంగా భార్య కళ్ళలోకి చూస్తున్నాడు.

ఆ సమయంలో ఎవరో యింటి తలుపు తట్టారు. జనార్దనం వెళ్ళి తలుపులు తీశాడు.

"నమస్కారమండీ జనార్దనంగారు మీరేనా?" అనడిగింది తలుపు తట్టినామె.

"అవునండి, మీరెవరు?"

"నా భర్త పేరు అనంతం. నిన్న రాత్రి ఆయన మీ ఇంటికని బయల్దేరారు. తను రాత్రికి రాననీ, బహుశా ఆక్రమించి అలాగే ఏదైనా అర్జంటు పనిమీద పొరుగూరు వెళ్ళవచ్చుననీ, అలా అవసరపడే పక్షంలో ఉత్తరం రాసి మీయింట్లో ఇచ్చి వెడతాననీ చెప్పారు" అందామె.

జనార్దనం క్షణం ఆలోచించాడు. ఆమె కేమని చెప్పాలి? అనంతం హత్య చేయబడ్డాడన్న నిజం ఆమెకు తెలియకూడదు. తెలిస్తే తను చిక్కుల్లో పడతాడు. నిజం చెప్పాలంటే అర్ధరాత్రివేళ చావుకేక విని లేచి వెళ్ళి చూడకపోతే అసలు అనంతం తనింటికి వచ్చినట్లే తెలిసుండేది కాదు.

"అనంతమంటే ఎవరో నాకర్థం కాలేదు."

"మీరు తనకు క్లబ్బులో పరిచయమయ్యారని చెప్పారాయన..."

జనార్దనం క్షణం ఆలోచించినట్లు నటించి "ఓహో ఆ అనంతమా! అతను నాకు బాగా తెలుసు. కానీ రాత్రి అతను మా యింటికి రాలేదే?" అన్నాడు.

అనంతం భార్య దెబ్బతిన్నట్లు కనబడింది. "ఏము న్నారూ? ఆయన మీ యింటికి రాలేదూ?" అంది.

"రాలేదండి" అన్నాడతను.

ఆ విషయాన్ని ధృవపర్చుకుని ఆమె వెళ్ళిపోయింది. జనార్దనం తలుపులు వేసి భార్య దగ్గరకు వెళ్ళాడు. జరిగింది చెప్పాడు. ఇద్దరం అనంతం భార్యను తల్చుకుని జాలిపడ్డారు.

"పాపం ఆవిడకు భర్త పోయినట్లు తెలియదు. ఎంత కాలమలా ఎదురు చూస్తుందో అతనికోసం—" అంది సీత.

"హంతకుడసాధ్యుడు. బహుశా అనంతం గురించి ఏవిధమైన ఆచూకీ బయటపడ నివ్వడనుకుంటాను" అన్నాడు జనార్దనం.

సీత ఉలిక్కిపడింది. "అనంతం హత్య చేయబడ్డట్లు తెలిసిన వాళ్ళం మన మిద్దరమే—ఆ విషయం హంతకుడికి తెలిసిందంటే..."

"సీతా నాకో ఆలోచన తడుతోంది." అన్నాడు జనార్దనం. "హత్య కళ్ళబడిన కారణంగా నీకు జ్వరం వచ్చింది. జర్వానికి బదులు నీకు చాలా పెద్ద జబ్బు చేసిందనుకో, నిన్నేదైనా నర్సింగ్ హోమ్‌లో చేర్చాలనుకో అప్పుడు మనం చెప్పకుండానే హంతకుడు తనకు తనే ఇల్లు వదిలి వెడతాడు."

"కానీ, నాకు పెద్ద జబ్బు చేయలేదు. అది మన దురదృష్టం" అంది సీత.

"సీతా నా వెర్రి సీతా!" అన్నాడు జనార్దనం "నీకు జబ్బు చేయనవసరం లేదు. అలా నటిస్తే చాలు."

"నటనా?" అంది సీత కంగారుగా.

"అవును, అంతకుమించి ఉపాయం వేరే కనబడ్డం లేదు" అన్నాడు జనార్దనం.

"సాయంత్రం హంతకుడు వచ్చిన గంటకు నువ్వు మెలికలు తిరిగిపో. దారుణమైన బాధనభినయించు. నేను నిన్ను నర్సింగ్ హోమ్‌లో చేర్చే ఏర్పాట్లు చేస్తాను" అనాడు జనార్దనం.

తర్వాత అతను నెమ్మదిగా పనులు చేసుకోసాగాడు. పక్క వీధిలో పబ్లిక్ టెలిఫోన్ బూత్ లోంచి కంపెనీకి ఫోన్ చేసి తను ఆఫీసుకు రావడం లేదని చెప్పాడు.

సీత జ్వరం మధ్యాహ్నానికి దిగిపోయింది. భోజనం చేసేయవచ్చునని డాక్టర్ చెప్పినప్పటికీ ఆ పూటకు బ్రెడ్ తీసుకుందామె ఎందుకైనా మంచిదని.

సాయంత్రం హంతకుడు సుమారు అయిదు గంటల ప్రాంతంలో వచ్చాడు. అతడు చాలా ఉత్సాహంగా ఉన్నాడు. వస్తూనే అతను సీత యోగక్షేమాలు విచారించాడు. ఆమె జ్వరం తగ్గిపోయినందు కానందాన్ని వ్యక్తపరిచాడు.

"చాలా ఉత్సాహంగా కనబడుతున్నావ్?" అన్నాడు జనార్దనం.

"అవును ఒక సమస్య తీరిపోయింది. మరో కొత్త బేరం తగిలింది..." అన్నాడు హంతకుడు.

'బేరమంటే?' అనుకున్నాడు జనార్దనం తనలో. బహుశా మళ్ళీ ఎవరికో మూడి వుండాలి. పాపం ఆ దురదృష్టవంతు డెవరో? అతనికి అనంతం గుర్తుకువచ్చాడు.

"ఉదయం మా ఇంటి కొకామె వచ్చింది. తన భర్త

పేరు అనంతం అని చెప్పింది. అనంతం నాకు క్లబ్బు స్నేహితుడు. అతను రాత్రి నా యింటికని బయల్దేరి మళ్ళీ తిరిగి ఇల్లు చేరలేదట. ఏమైనా తెలుసునేమో అడుగుదామని వచ్చింది'' అన్నాడు జనార్దనం.

''ఆమెకు నీ ఇల్లెలా తెలుసు?'' అనుమానంగా అడిగాడు హంతకుడు.

''మా ఇంటినుంచి అనుకోని పని తగిలితే పొరుగూరు వెళ్ళాల్సి వుంటుందనీ అలా జరిగే పక్షంలో ఒక ఉత్తరం మా ఇంట్లో ఇచ్చి వెడతానని చెప్పాడట. బహుశా భర్త ఆమెకు చిరునామా యిచ్చివుంటాడు—'' అన్నాడు జనార్దనం.

''ఏం చెప్పావ్ నువ్వు?''

''అనంతంతో నాకు కాస్త పరిచయమున్న మాట నిజమే కానీ, మా ఇద్దరికీ ఒకరిళ్ళకొకరు వెళ్ళేటంత పరిచయాలు లేవు. రాత్రి నాకు తెలిసినంత వరకూ మాఇంటికెవ్వరూ రాలేదని చెప్పాను. నిరుత్సాహంగా వెళ్ళిపోయింది. చాలా జాలి కలిగిందామెను చూస్తే నాకు.''

హంతకుడు తేలిగ్గా నిట్టూర్చాడు. ''అనంతానికి నీతో పనిలేదు. కానీ నాతో పనివుంది. అతను నీ యింటికని బయల్దేరాడు. కానీ. నీ ఇంటికి రాలేదు. మధ్యలోనే పొరుగూరు వెళ్ళిపోవలసొచ్చింది. నేనే స్వయంగా అతన్ని పంపేశాను. వెళ్ళేముందు తన భార్యకో ఉత్తరమిచ్చాడు అదామెకు నేనీ రోజు మధ్యాహ్నం అందజేశాను.''

ఇద్దరూ అవీ ఇవీ కబుర్లలో ఉండగా లోపల్నుంచి ఆర్తనాదంలాంటిది వినపడింది. జనార్దంతోపాటు హంతకుడుకూడా లేచాడు. కంగారుగా లోపలకు ప్రవేశించా

రిద్దరూ. లోపల మంచం మీద సీత కడుపు పట్టుకుని మెలి కలు తిరిగిపోతోంది. వీళ్ళను చూస్తూనే "బాధ భరించ లేక పోతున్నాను. కడుపులో నొప్పి" అంటూ అరిచినట్లు చెప్పింది.

హంతకుడు కంగారుగా "బావా నువ్వు చెల్లాయ్ దగ్గ రుండు నేను వెళ్ళి డాక్టర్ని పిలుచుకువస్తాను" అన్నాడు.

"నువ్వే వుండిక్కడ మా ఫామిలీ డాక్టర్ని పిలుచుకు వస్తాను..." అన్నాడు జనార్దనం.

"నువ్వెందుకులే బావా చెల్లాయ్‌కి నువ్వు పక్కనుంటే ధైర్యంగా వుంటుంది. ఫామిలీ డాక్టరు అడ్రసివ్వు. క్షణాల మీద తీసుకొస్తాను" అన్నాడు హంతకుడు.

"లేదు నేను వెడితే కానీ ఈ సమయంలో ఆయన రాడు. పేషెంట్లతో చాలా రద్దీగా వుండే సమయమిది" అన్నాడు జనార్దనం. అతని బాధ వేరు. సీత జబ్బుగురించి ఫామిలీ డాక్టరుకి కాస్త వివరించాలని అతననుకుంటు న్నాడు.

కానీ హంతకుడు వినలేదు "ఏం మనిషివి నువ్వు బావా అవతల చెల్లాయలా అవస్థపడుతూంటే నీకు కాళ్ళూ చేతులూ ఎలా ఆడతాయి. డాక్టరెందుకు రాడు. రివాల్వర్ చూపించైనా లాక్కొస్తాను. నీకా భయం లేదు" అంటూ సమాధానం కోసమైనా ఎదురు చూడకుండా వీధిలోకి పరుగెత్తాడు. అతని వెనుకనే వెళ్ళి వీధి తలుపులు వేసి భార్య దగ్గరకు వచ్చి తలపట్టుకున్నాడు జనార్దనం.

"అతను వెళ్ళడమే మంచిదయింది. లేకపోతే డాక్టర్ వచ్చేదాకా ఇలా నటించడం నావల్లనయ్యేది కాదు" అంది సీత.

"చాలా బాగుంది నువ్వోగంట నటన గురించి ఆలోచిస్తున్నావ్. కానీ ఈ హంతకుణ్ని వదిలించుకునే ఓ గొప్ప అవకాశం పోయిందని నాకు బాధగా వుంది."

"అలా భయపడకండి. డాక్టర్ వచ్చేక పక్కకు వెళ్ళి విషయం చెప్పండి."

"అందుకీ హంతకుడు అవకాశమిస్తాడని నాకు తోచడం లేదు" అన్నాడు జనార్దనం.

హంతకుడు డాక్టర్ని తీసుకురావడానికి గంట కూడా పట్టలేదు. డాక్టర్ కంగారుగా "ఏమైంది మిస్ సీతాదేవీ!" అన్నాడు.

సీత నానా అవస్థనూ నటిస్తూ "కడుపులో బాధ డాక్టర్ గారూ భరించలేక పోతున్నాను. ఈ బాధ భరించేకంటే ప్రాణాలు పోయినా బాగుండుననిపిస్తోంది" అంది.

"నోనోనో__అలా ప్రతిదానికి అసహనం కూడదు" అంటూ డాక్టర్ సీతను పరీక్ష చేశాడు. అయిదు నిమిషాల అనంతరం డాక్టర్ జనార్దనం వంక చూసి "జ్వరం తగ్గిపోయింది. ఒంట్లో ఏమీ అనారోగ్యమునట్లనిపించడం లేదు. ఇంక నాకు ఒక్కటే అనుమానం మిగిలింది. నేను లైటుగా మీల్సు తీసుకోమన్నాను. జిహ్వా చాపల్యం కొద్దీ కాస్త స్ట్రాంగ్ ఫుడ్ తీసుకుని ఉండాలి" అన్నాడు.

"నాకు తెలిసినంత వరకూ సీత బ్రెడ్ తప్ప ఇంకేమీ తినలేదు. హార్లిక్స్ తప్ప మరేమీ తాగలేదు" అన్నాడు జనార్దనం.

"ఏమైనప్పటికీ కంగారేమీ లేదు. ప్రస్తుతానికి

తాత్కాలికోపశాంతి కలిగించి, నిద్రపట్టేలా మందిస్తాను. ఉదయానికేమీ కంగారు లేకపోతే ఇంక నాదగ్గరికి రావలసిన అవసరం లేదు'' అన్నాడు డాక్టర్.

''ఏమీ ప్రమాదం లేదంటారా డాక్టర్ సీతది చాలా డెలికేట్ బాడీ. దేనికీ తట్టుకోలేదు. ఉదయం జ్వరం వచ్చింది. సాయంత్రానికి కడుపునొప్పి వచ్చింది. మళ్ళీ రాత్రికి ఏమవుతుందోనని భయంగా వుంది. కొన్ని రోజుల పాటు మీ నర్సింగ్ హోమ్‌లో ఉంటే మంచిదేనని పిస్తోంది'' అన్నాడు జనార్దనం.

''వాట్! కడుపు నొప్పికి నర్సింగ్ హోమా భలే కంగారు మనుషులండి మీరు'' అని నవ్వి ''పోనీ మీకంత భయంగా వుంటే నాకేమీ అభ్యంతరం లేదు'' అన్నాడు డాక్టర్.

జనార్దనం తృప్తిగా నిట్టూర్చి ''నామనసిప్పుడు తేలిగ్గా ఉంది'' అన్నాడు.

హంతకుడు కలగజేసుకుని ''ఇలాంటి చిన్న చిన్న వాటికి నర్సింగ్ హోంలో చేర్చడం మనిషి ఆరోగ్యానికి శ్రేయస్కరం కాదు. పది రోగులమధ్య వుంటే ఆరోగ్యంగా వున్న వాడి కూడా జబ్బుపడ్డ అనుభూతివచ్చేస్తుంది. ఇంట్లో ప్రశాంతమైన వాతావరణంలో ఉంటే మరే ఇబ్బందీ ఉండదు'' అన్నాడు.

''కానీ, కాస్త కనిపెట్టి చూసుకునేవారు కావాలి కదా...అవసరమైన వెంటనే డాక్టర్ రావాలి కదా'' అన్నాడు జనార్దనం.

''చెట్టంత అన్నగారిని నేనున్నాను. ప్రాణప్రదంగా చూసుకునే భర్తవు నువ్వున్నావు. పిలిస్తే పలికే దేవుడి

లాంటి డాక్టరీయనున్నారు. ఇప్పుడు సీతప వచ్చిన లోటే ముంది? అంతగా అనుక్షణం కనిపెట్టుకు చూసేవాళ్లు కావాలనుకుంటే నాకు తెలిసిన లలితారాణి అనే నర్ ఒకామె వుంది. ఆమెను పిల్చుకువస్తాను" అన్నాడ హంతకుడు.

జనార్దనం కడబడ్డాడు. అతని నోరు మూతపడింది.

డాక్టరు "మీ బావగారి మాటలు నిజం. అలా జరిపి బాగుంటుంది" అన్నాడు.

జనార్దనం మౌనంగా తలూపాడు.

ఆ రాత్రి అతను భార్యతో, "ఈ హంతకుడు అసా ధ్యుడు. వీణ్ని వదుల్చుకోవడం మనకు సాధ్యపడేలా లేదు మనకింకే నర్సూ అవసరంలేదు. రేపటికి నీ కడుపునొప్పి పూర్తిగా తగ్గిపోవాలి" అన్నాడు.

# 9

"ఈరోజు రాత్రి నేను బయట భోజనం చేస్తాను" అ సాయంత్రం ఆరుగంటలకు భార్యాభర్తలిద్దరకూ చెపి హంతకుడు బయటకు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిపోయాక దంపతులిద్దరూ హంతకుడిగురిం చర్చించుకున్నారు. ఏంచేయాలో ఇద్దరికీ పాలుపోవడ లేదు. జరిగిన సంఘటనలు భయాన్ని కలిగిస్తున్నాయి జరుగుతున్న సంఘటనలు నవ్వాలో, ఏడవాలో తెలియ కుండా చేస్తున్నాయి. జరగబోయే సంఘటన లెల వుంటాయోనని ఉత్కంఠను కలిగిస్తున్నాయి. కానీ, తామ చేయగలిగినదేమీ లేదు. నిస్సహాయంగా చూస్తూ ఊర కోవడమే!

తొమ్మిది గంటల ప్రాంతంలో నిద్రపోయే ముంద

"హంతకుడింకా రాలేదు. దొడ్డితలుపు తీసివుందో లేదో, చూసి, తీసి వుంచకపోతే అనవసరపు గొడవ" అన్నాడు జనార్దనం. ఇద్దరూ ఆ సంగతి చూడడానికి వెళ్ళారు. చూడడం మంచిదే అయింది. దొడ్డితలుపు వేసివుంది. గడియ తీసి ఇద్దరూ తమ పడకగదిలోకి వెళ్ళిపోయారు. హంతకుడి నింట్లోంచి పంపించేయడానికి యింకా యేం పథకాలు వేయాలా అని కాసేపు చర్చించి నిద్రకు పడ్డారిద్దరూ.

ఒక రాత్రివేళ ఎవరో తలుపు తడుతున్న చప్పుడు విని చటుక్కున లేచాడు జనార్దనం. సీత అతని చేయి పట్టుకుంది. "చప్పుడు నేనూ విన్నాను. నాకేదో భయంగా వుంది. మీరు వెళ్ళొద్దు" అందామె.

తలుపులు మరింత గట్టిగా బాదారెవరో!

"ఫరవాలేదు - భయపడకు" అంటూ మంచం దిగాడు జనార్దనం. దుప్పటిని మీదకు లాక్కుని కప్పుకుంది సీత.

జనార్దనం గదిలో లైటు వేశాడు. తలుపులింకా ఎవరో బాదుతూనే వున్నారు. "ఎవరది?" గట్టిగా అన్నాడు జనార్దనం.

"నేను" అని సమాధానం వచ్చింది. కంఠం హంతకుడిది.

"అమ్మయ్యా!" అని తేలిగ్గా నిట్టూర్చింది సీత. హంతకుడంటే వాళ్ళకు క్రమంగా భయం తగ్గుతోందనే అనుకోవాలి. అతనెలాంటివాడైనా తమకేమీ అపకారం చేయడన్న అభిప్రాయం సీతకు కలిగింది.

జనార్దనం వెళ్ళి తలుపులు తీశాడు. బయట హంతకుడు నిలబడి వున్నాడు. "ఇద్దరికిద్దరే మొద్దు నిద్ర" అన్నాడు

చిరాగ్గా. అతని ముఖం ప్రసన్నంగా లేదు.

"బాగుంది. రాత్రి సమయంలో లేపేవాళ్ళదే కానీ, పడుకునేవాళ్ళది తప్పుకాదు..." అన్నాడు జనార్దనం.

"సరేలే. ఇప్పుడు నేను తప్పొప్పులు విచారించడానికి రాలేదు. నా గదిలో ఒక్క చుక్క కూడా మంచినీళ్ళు లేవు. ఇప్పుడే ఒక కస్టమర్ని తీసుకువచ్చాను. అతనితో మాటలు మొదలు కాకుండానే దాహమన్నాడు. తీరా చూస్తే కూజా ఖాళీ! నా గదిలో ఏర్పాట్లన్నీ పక్కాగా. వుండాలని వచ్చినరోజునే చెప్పాను..." అన్నాడు హంతకుడు.

"సరేలే - ఏదో పొరపాటు జరిగినట్లుంది. వచ్చి కూజా తీసుకువెళ్ళి నింపి యిస్తాను" అన్నాడు జనార్దనం.

"నువ్వు రానవసరంలేదు. నా కస్టమర్ని మరొకరి కళ్ళపడ్డం నా కిష్టముండదు. ఏదో, బావా అని పిలుస్తున్నాను నిన్ను. అలాంటిది నిన్ను చంపాల్సివస్తే నా కెంత బాధగా వుంటుందో ఆలోచించు. అందుకే ఓ చెంబెడు నీళ్ళియ్యి. ఈ రాత్రికి సర్దుకుంటాను. రేపుమాత్రం, నువ్వు చేయవలసిన మొట్టమొదటి పని అదే!" అన్నాడు హంతకుడు.

జనార్దనం మనసులో మాత్రమే విసుక్కున్నాడు. గదిలో మరచెంబు నిండా నీళ్ళున్నాయి. ఆ చెంబు తీసుకువెళ్ళి హంతకుడికిచ్చి గది తలుపులు వేసేసి లైటు ఆర్పేశాడు.

"మళ్ళీ హంతకుడెవరో మనిషిని తీసుకువచ్చాడు. ఇంకో హత్య జరుగుతుందేమో!" అన్నాడు జనార్దనం సీత దగ్గరకు వెళ్ళి.

“ఏమో యేమిటి_జరిగి తీర్తుంది. ఏ జన్మలో ఏం పాపం చేశామో, ఇలాంటి హంతకుడికి ఆతిథ్యమివ్వాల్సొచ్చింది” అంది బాధగా సీత.

“సీతా_నువ్వు మాట్లాడకుండా పడుకుని వుండు. బయటకు వెళ్ళి ఏం జరుగుతుందో చూసివస్తాను” అన్నాడు జనార్దనం.

“వద్దండీ_వాడసలే మిమ్మల్ని హెచ్చరించి వున్నాడు కూడా. ఏం చేస్తాడో ఏమిటో.”

“వాడికి తెలియనివ్వనుగా, రహస్యంగా చూసేసి వస్తాను. హంతకుడన్నవాడెప్పుడో అప్పుడు చట్టానికి దొరక్క తప్పదు. అలాంటి సమయం వచ్చినప్పుడు తిరుగులేని దెబ్బలు తీయడానికి, వీడి బండారం కొంతవరకూ తెలుసుకుని వుండడం మంచిది. నువ్వుమాత్రం రావద్దు. ఎందుకంటే నీకు మళ్ళీ జ్వరంలాంటిది వస్తే హంతకుడి అనుమానాలు బలపడతాయి” అని జనార్దనం పిల్లిలా అడుగులు వేసుకుంటూ గదిలోంచి బయటపడి, గది తలుపులు చప్పుడు కాకుండా జారగిలవేశాడు.

హంతకుడి గదిలో దీపం వెలుగుతోంది. గదిలో కూర్చున్న మనిషి వీపు కనబడుతోంది. హంతకుడి ముఖం గుమ్మంవైపే వుంది. జనార్దనం గోడవార నక్కాడు. ఒకవేళ ఎవరైనా గదిలోంచి బయటకువస్తే, పక్కకు జారుకునేందుకు వీలుంది. అతను శ్రద్ధగా వాళ్ళ మాటలు వినసాగాడు. వాళ్ళు నిర్భయంగా గట్టిగా మాట్లాడుకుంటున్నారు.

“ఈ స్థలం నాకు చాలా అనువుగా వుంది. అందువల్ల హత్యచేయడం నాకిప్పుడు చాలా సులువు. నీ పనేమిటో

త్వరగా చెప్పు..." అన్నాడు హంతకుడు.

"కాస్త నెమ్మదిగా మాట్లాడవయ్యా - ఎవరైనా విన గలరు?" అన్నాడు కొత్త వ్యక్తి.

"వినడమా-ఈ ఇంట్లో మనం కాక ఇంక ఇద్దరే ఇద్దరు మనుషులున్నారు. ఇద్దరికీకూడా నేనంటే చచ్చేటంత భయం" అన్నాడు హంతకుడు నిబ్బరంగా.

"సరే-విషయానికి వద్దాం, ఎలా చంపుతావో అది నీ ఇష్టం. నా మీదకు ఎవరి అనుమానమూ రాకూడదు. లక్ష్మీ నారాయణ ఈ లోకంలో వుండకూడదు. ఎంత కావాలో చెప్పు!"

"మీ శక్తినిబట్టి నా రేటుంటుంది. అందరికీ ఒకే రేటు కాదు నాది" అన్నాడు హంతకుడు దర్పంగా.

"సరే-అయితే చెబుతున్నాను. పాతిక వేలిస్తాను" అన్నాడా కొత్త వ్యక్తి.

హంతకుడు క్షణం ఆలోచించి, "ఓకే - బాగానే చెప్పారు - మీరిక వెళ్ళవచ్చు" అన్నాడు.

కొత్త వ్యక్తి లేవలేదు, "ఎప్పుడు?"

"రేపు రాత్రికి లక్ష్మీనారాయణ ఈ లోకంలో వుండడు. మీకు వాటాదారుడుగా వుంటూ, మిమ్మల్ని మోసంచేసి మీ వ్యాపారంలో ఎక్కువ లాభాలు కొట్టేసిన పాపానికి, ఆయన రేపురాత్రి శిక్ష ననుభవిస్తాడు. మీ ఇష్టం వచ్చినట్లు మీరు పగ తీర్చుకోవచ్చు. ఆయన కుటుంబానికి మీ రన్యాయం తలపెట్టవచ్చు..."

"ఛా-అలా గెందుకు చేస్తాను! వాళ్ళ జీవితానికి లోటు లేకుండా ఏర్పాట్లు చేస్తాను..."

"అది మీ ఇష్టం-మీకు సంబంధించిన పని" అన్నాడు హంతకుడు.

కొత్త వ్యక్తి లేచాడు. జనార్దనం చీకట్లోకి వెళ్ళి పోయాడు. హాంతకుడు కొత్తవ్యక్తిని దొడ్డిగుమ్మంద్వారా సాగనంపుతూంటే, జనార్దనం తన పడకగదిలోకి వెళ్ళి పోయాడు.

# 10

"బావా! మళ్ళీ రిక్షా కావాలి - మీ ఇంటినుంచి నది ఒడ్డుకు. నేనూ, ఒక ట్రంకుపెట్టి వుంటామని చెప్పు..." అన్నాడు హాంతకుడు.

జనార్దనం గుండె లదిరాయి. లక్ష్మీనారాయణ కథ ముగిసిందని అర్థమయిం దతనికి. ఎవడో ఆ లక్ష్మీనారాయణ-అనుకున్నాడతను.

జనార్దనం వెళ్ళి రిక్షా పిల్చుకువచ్చాడు. అతనూ, హాంతకుడూ కలిసి బరువైన ఆ ట్రంకుపెట్టిని మోసి రిక్షాలో పెట్టారు. రిక్షా కదిలి వెళ్ళిపోయేక, "ఇంకా యిలాంటి ట్రంకు లెన్ని మోయాల్సుందో నేను..." అన్నాడు జనార్దనం.

సీత తలుపులు వేసి, "ఒకసారి హాంతకుడి గదిలోకి వెళ్ళి చూద్దాం పదండి" అంది.

ఇద్దరూ హాంతకుడి గదిలోకి వెళ్ళారు. గదంతా శుభ్రంగా తుడిచినట్లుంది. ఒకటి రెండు ప్రాంతాల నీళ్ళతో కడిగినట్లుంది. మంచంమీద దుప్పటీ నలగకుండా వేసివుంది.

"హాంతకుడీ పర్యాయం మంచంమీద హత్యకు మన దుప్పటీ వాడినట్లు లేదు" అన్నాడు జనార్దనం.

"వాడితే, కెల్లాయ్-దుప్పటీ మార్చాలమ్మా" అంటూ అడిగుండేవాడుగా అంది సీత. ఆమె ఒక్క క్షణం ఆలో

చించి, "ఈ రాత్రి మనకేమీ కేక వినపడలేదు గదా - మనం అంత మొద్దునిద్దర పోయామంటారా?" అంది మళ్ళీ.

"హంతకుడు చాలా తెలివైనవాడు. క్రితం పర్యాయం చచ్చినవాడంత పెద్దకేక పెడతాడని అతని ఊహకు తట్టలే దెందువల్లనో. అందుకే ఈ పర్యాయం హతుడికి నోట్లో గుడ్డలుకుక్కి చంపేసి వుంటాడు. కిక్కురుమన కుండా చచ్చుంటాడు పాపం."

సీత మరోపర్యాయం మంచంమీద దుప్పటీ వేసి తల గడాలు సర్దబోతూండగా వాటికింద ఒక చిన్న నోట్ బుక్ కనబడింది. జనార్దనం చటుక్కున సీత చేతిలోంచి ఆ పుస్తకం లాక్కున్నాడు. అందులో మొదటిపేజీ చూసి గతుక్కుమన్నాడతను.

ఆ పేజీలో కొన్ని పేర్లు రాసివున్నాయి. ఒకటి అంకె వేసి అనంతం పేరు రాసివుంది. రెండంకె వేసి లక్ష్మీ నారాయణ పేరు రాసివుంది. రెండుపేర్లకూ పక్కన ఇంటూమార్కులు పెట్టివున్నాయి. మూడోఅంకె వేసుంది కానీ, అక్కడింకా పేరేదీ వ్రాయబడలేదు. జనార్దనం ఆ పేజీని సీతకు చూపించాడు. సీత కది చూస్తూనే ముచ్చెమ టలూ పోశాయి.

"ఇదెక్కడి తంటసం వచ్చిపడిందండీ మనకి! హాయిగా సుఖంగా వున్నామనుకుంటే" అంది సీత భయంగా.

జనార్దనం నోట్ బుక్ లో పేజీలు తిరగేశాడు. ఒక పేజీలో రెండు చిరునామాలున్నాయి. ఒకటి అనంతానిది. రెండు లక్ష్మీనారాయణది. ఆతృతగా అతనా చిరునామా చూశాడు. హోటల్ గ్రీన్ లాండ్సులో పనిచేసేనో నంబరు గదిలో వుంటున్నాడు లక్ష్మీనారాయణ. అంటే ఈ ఊరి

వాడై వుండడు లక్ష్మీనారాయణ. అతనెవరో, అతని కథేమిటో తెలుసుకోవా లనిపించింది జనార్దనానికి. సీతకు కూడా అదేమాట చెబితే, "చూడండి, అనవసర వ్యవహారాల్లో తల దూర్చకండి మీరు. అనవసరంగా హత్య కేసులో ఇరుక్కోగలరు" అందామె.

కానీ, జనార్దనానికి కుతూహలం చావలేదు. అతనాఫీసుకు వెళ్ళేముందు హోటల్ గ్రీన్‌లాండ్సుకి వెళ్ళాడు.

లక్ష్మీనారాయణ ఇంకా హోటల్ ఖాళీ చేయలేదు. అతనక్కడ భార్యతోసహా మకాం పెట్టాడు. గదిలో అతని భార్య వుంది. తన భర్తకోసం ఎవరో వచ్చారని తెలియగానే ఆత్రతగా చూడబోయిందామె. జనార్దనాన్ని చూస్తూనే ఆమె ముఖంలో నిరుత్సాహం కనబడింది.

"నిన్నరాత్రి వారు - ఒక నూతన వ్యక్తితో వెళ్ళారు. అవసరమైన పక్షంలో పొరుగూరు వెళ్ళాల్సొంటుందనీ, అలా జరిగేపక్షంలో కబురు పంపిస్తాననీ అన్నారు. నాకు కబురువస్తే, గది ఖాళీచేసేసి రాత్రి ట్రయిన్‌కి వెళ్ళిపోతాను" అందామె.

"సరే - అయితే నాకాయన్ను కలుసుకునే అదృష్టం లేదు. నా స్నేహితుడొకడుకూడా ఆయన్ని కలుసుకోవాలనుకున్నాడు. నిన్నరాత్రి మీ భర్త వెళ్ళిన నూతనవ్యక్తి ఎలాగుంటాడో చెప్పగలరా? అతనే నా స్నేహితుడైతే, నేనింక వేరే మీ భర్తను కలుసుకోవాల్సిన అవసరముండదు" అన్నాడు జనార్దనం.

ఆమె వర్ణించి చెప్పింది. అవి సరిగ్గా హంతకుడికి సరిపోయాయి. జనార్దనం అక్కణ్ణించి బయటపడ్డాడు. అతని

మనస్సు నిండా లక్ష్మీనారాయణ భార్యపట్ల జాలి నిండి వుంది. ఆమెకు ముప్పై అయిదేళ్ళుంటాయి. మనిషి చాలా అందంగా వుంది. పదేళ్ళు దాటిన పిల్లలిద్దరున్నారు. ఇంత వరకూ ఖరీదైన జీవితం అనుభవించిందామె!

జనార్దనం ఆఫీసులో వుండగా అతనికి ఫోన్ కాల్ వచ్చింది. అతను చాలా ఆశ్చర్యపడ్డాడు. ఫోన్ చేసింది అతని మావగారు. అర్జంటుగా ఏదో మాట్లాడాలనీ, అప్సరా హోటల్లో పదకొండో నంబరు గదిలో సాయంత్రం తనని కలుసుకోవలసిందనీ శంకర్రావుగారు ఫోన్ చేశాడు. తను వచ్చిన విషయం సీతకు చెప్పవద్దన్నాడు.

మావగారికి తనతో మాట్లాడవలసొచ్చిన అర్జంటు విషయమేమిటో అర్థంకాక చాలాసేపు మథనపడ్డాడు జనార్దనం. ఆయనకు తనంటే ద్వేషభావం తప్ప మరేమీ లేదు. తన చావుకోరే వ్యక్తి ఆయన. ఆయనవద్ద నమ్మిన బంటుగా, చేదోడు వాదోడుగా వుంటూన్న వెంకటరమణంటే ఆయనకు ఎంతిష్టముంటే, అతన్ని యింటల్లుడిగా చేసుకోవాలనుకుంటున్నా రాయన. వెంకటరమణ ఆయనకేదో దూరపువరుసలో బంధువవుతాడు. చిన్నప్పట్నించీ మావయ్యా అని పిలుస్తూ, ఆయనింట్లోనే పెరిగి పెద్దవాడయ్యాడు. శంకర్రావుగారిచ్చిన చనువును పురస్కరించుకుని అతను సీతమీద చాలా ఆశలు పెంచుకున్నాడు. కానీ, విధి మరోలా తలచింది. సీత తనని ప్రేమించింది!

వెంకటరమణ ఇంకా పెళ్ళి చేసుకోలేదు. తను చస్తాడనో, లేక సీత తనకు విడాకులిస్తుందనో అతనికింకా ఆశ వున్నట్లుంది. బహుశా, ఆ ఆశను శంకర్రావుగారే కల్పించి వుంటారని సీత అంటుంది.

శంకర్రావుగారు తనతో ఇప్పు డర్జంటుగా మాట్లాడ వలసిన దేమిటో!

సాయంత్రం ఆఫీసునుంచి వెళ్ళేటప్పుడు జనార్దనం అప్సరా హోటల్ కు వెళ్ళి శంకర్రావుగారిని కలుసుకున్నాడు. అత ననుకున్నట్లు శంకర్రావుగారు ద్వేష భావాన్ని ప్రదర్శించలేదు. మొట్టమొదటిసారిగా ఆయన అల్లుడితో ఆప్యాయంగా మాట్లాడేరు.

"మొదట్లో తప్పుగా అర్థంచేసుకున్నాను కానీ, నువ్వు చాలా యోగ్యుడివి. సీత కాపురం-హాయిగా నడుస్తోందని తెలుసుకున్నాను. ఎటొచ్చీ నాకు ఒక్కటే బాధగా వుంది. సీత నా కొక్కగానొక్క బిడ్డ. దాన్ని నేను కంటికి రెప్పలా పెంచాను. కష్టమంటే తెలియకుండా చూసుకున్నాను. ఈనాడది సామాన్యమైన జీవితం గడుపుతూంటే చూస్తూ ఊరుకోలేకున్నాను."

"సీత జీవితం ఇప్పుడు సామాన్యంగా ఏమీ లేదు..." అన్నాడు జనార్దనం పౌరుషంగా.

శంకర్రావుగారు నాలిక్కరుచుకుని, "నా అభిప్రాయం అదికాదు. నిన్ను చిన్నబుచ్చాలన్నది నా అభిమతం కాదు. నేను చెప్పేది విని నువ్వే ఆలోచించు. నేను కోటీశ్వరుణ్ణి. నువ్వో సామాన్య ఉద్యోగస్తుడివి. నా స్థాయికి నువ్వెన్నడూ చేరుకోలేవు. నాకులా సీతను చూసుకోనూ లేవు" అన్నాడు.

జనార్దనానికి కోపం వచ్చిందన్న విషయం యెర్రబడ్డ అతని ముఖమే చెబుతోంది.

"అలాగని నువ్వు సీతకు తక్కువ చేస్తున్నావని నే ననడంలేదు. వివాహమైపోయినంత మాత్రాన తండ్రిగా

నా బాధ్యతలు తొలగిపోతాయని నేననుకోవడంలేదు. కానీ, నా పేరు చెబితేనే మండిపోతోంది సీత. అది నా దురదృష్టం. నువ్వు నాకు చేయగలిగిన సహాయమేమిటంటే నేను నీకో కారు కొనిస్తాను. బ్యాంకులో నీ పేరున రెండులక్షలు వేస్తాను. ఈ రెండూ నావల్ల జరిగినట్లు సీతకు తెలియనివ్వకు. సీతను మాత్రం దర్జాగా చూసుకో. దాన్ని కారులో తప్ప తిప్పవద్దు'' అన్నాడు శంకర్రావు నిట్టూరుస్తూ.

జనార్దనం ఉలిక్కిపడ్డాడు. మామగారి అభిప్రాయమది అని అతని కింతవరకూ తెలియలేదు. వెంటనే ఏం చేయాలో, ఏం మాట్లాడాలో తోచక అతను మౌనం వహించాడు.

''కోటీశ్వరుడి ఏకైక పుత్రికకు భర్తవు నువ్వు. ఆ దృష్ట్యా చూస్తే నీకు రెండులక్షలివ్వడం నువ్వు అవమానంగా భావిస్తున్నావనుకుంటాను. నన్ను పూర్తిగా అర్థం చేసుకుంటే అలాగనుకోవు. నేను అమ్మాయి పేరున పది లక్షల రూపాయలకు షేర్లు కొన్నాను. అవికూడా నీకే ఇస్తున్నాను. భద్రంగా దాచివుంచు. ఆమె అర్థాంతరంగా మరణించిన పక్షంలో అవి నీ పేరుకు మారతాయి. సీత పెళ్ళికి ముందే ఈ షేర్లున్నాయి. ఆ సంగతి దానికీ తెలుసు. కానీ, నేనిస్తే అది తీసుకోదు. నువ్వుకూడా ఈ వివరాలు వెంటనే చెప్పవద్దు. దాని మనసు కనిపెట్టి, మంచి సమయం చూసి చెప్పు'' అంటూ ఆయన అతనికి కొన్ని కాగితాలందించాడు.

జనార్దనానికి చాలా వింతగా వుంది. అతనా కాగితాలను పరీక్షించి చూశాడు. పేరుపొందిన రకరకాల కంపె

నీలలో సీత పేరున షేర్లున్నాయి. అవన్నీ ఆమెకు కాబోయే భర్తకు చెందుతాయి. ఆ భర్త అర్థాంతరంగా మరణించిన పక్షంలో అవి శంకర్రావుకు చెందుతాయి. వాటిలో వీలునామా ఒకటి వుంది. అది శంకర్రావు ఆస్తిపాస్తులలో సీతకు చెందవలసినవాటి వివరాలనిస్తూ వ్రాయబడింది. సీత మరణించిన పక్షంలో ఆ ఆస్తి ఆమె భర్తకు చెందాలని వ్రాయబడి వుంది. అవికాక శంకర్రావు జనార్దనానికి రెండు లక్షలు క్యాషుకూడా యిచ్చి, "రేపు నీ ఆఫీసుకు కొత్తకారు వస్తుంది. అది నీదే!" అన్నాడు.

"ఇదంతా మీ రెందుకు చేస్తున్నారో నా కర్థం కావడంలేదు" అన్నాడు జనార్దనం,

"అర్థంకావడాని కేముంది? నీ మూలంగా నా కూతురు నా క్కాకుండాపోయింది. నీ కారణంగా నేను దానికి శత్రువునైపోయాను. మళ్ళీ దాన్ని నా ఇంట మసిలేలా చేయాలన్నది నా కోరిక. అది నీ మూలంగానే సాధించాలన్నది నా కోరిక. సాధించగలనన్నది నా ఆశ!" అన్నాడు శంకర్రావు.

జనార్దనానికి మామగారి బాధ అర్థమైంది. ఆయన పితృహృదయం పడుతున్న వేదనను గుర్తించే డతను. శంకర్రావుగారి సహృదయతా, సద్బుద్ధీ అతన్ని పాత సంఘటనలు మరిచిపోయేలా చేశాయి. ఎలాగో అలా ప్రయత్నించి సీత మనసు మార్చాలని గట్టిగా అనుకుని అక్కణ్నించి బయటపడ్డా డతను.

ఇంటికి వెళ్ళేసరికి సీత ఒక్కర్తీ ఇంట్లో వుంది. హంతకుడు లేడు. అతను నెమ్మదిగా భార్యవద్ద మామగారి ప్రసక్తి తీసుకువచ్చి, "జన్మనిచ్చిన తండ్రి పూజ్యనీయుడు,

ఆయన్ని సహించుకోవడం చాలా తప్పని నాకు తోస్తోంది" అన్నాడు.

సీత నవ్వి, "మా నాన్నగారంటే నాకు చాలా గౌరవముంది. ఆయన్ని సహించుకోవడం పాపంగా భావిస్తున్నాన్నేను" అంది.

"కానీ, మరి..." జనార్దనం తడబడ్డాడు.

"చూడండి_దేవుడంటే భక్తివుంది నాకు. ఆ భక్తి కారణంగా నేను యితరుల కన్యాయం చేయకూడదనుకుంటాను. నా దైవభక్తి నన్ను మంచిదాన్ని చేయాలి. నాచే పదిమందికి మంచి చేయించాలి. అంతేకానీ _ ఇంట్లోనూ, గుడిలోనూ, పలువురి ఎదుట పూవులతో పూజించడమూ, లెక్కకుమించిన స్వార్థంతో కోర్కెలు కోరడమూ దైవభక్తి అని నేననుకోవడంలేదు."

సీత తన అభిప్రాయాలను చాలా ఖచ్చితంగా చెప్పడంతో జనార్దనం చాలా ఇరుకున పడ్డాడు. ఆమె మనసులో తండ్రికి విలువ వుంది. కానీ, అందుకాయన దగ్గర్నుంచి ప్రతిఫలాన్నేమీ ఆశించడం లేదామె. ప్రతిఫలాపేక్షతో మనిషిని గౌరవించడం సీత కిష్టముండదు. తను శంకర్రావుగారిమీద గౌరవం పెంచుకున్నాడంటే అది ప్రతిఫలాపేక్షతోనే! రెండులక్షల రూపాయల నాయాచితంగా వదులుకోవడం అతని కేమాత్రమూ యిష్టంలేదు.

కాస్సేపాగి అతను తెగించి బ్రీఫ్‌కేసు తెరిచి డబ్బు కాగితాలు అన్నీ చూపించి, శంకర్రావుగారి ఔదార్యాన్ని కొనియాడాడు. అతని మాటలు వింటూ దెబ్బతిన్నట్లు కనబడింది సీత.

"మీరు మా నాన్నగారిని పొగుడుతున్నారా?"

అందామె ఆశ్చర్యంగా. "ఆయన ఒకనాడు మిమ్మల్ని పురుగుకన్న హీనంచేసి మాట్లాడారు. ఆ మాటలు తలచు కుంటూంటే ఇప్పటికీ నా శరీరం ఉడికిపోతోంది..."

"ఆవేశం మానవ సహజం. తన కూతురు తనక్కాకుండా పోతోందన్న ఆవేదన ఆయన కావేశాన్ని కలిగించి యుక్తాయుక్త విచక్షణాజ్ఞానాన్ని నశింపజేసింది. అప్పుడు మనమూ ఉద్రేకపడ్డాం. కాలం గడిచింది. ఆవేశం నశించి ఆ స్థానంలో మమకారం మళ్ళీ తలెత్తుతోంది. దాన్ని మనం అణచివేయకూడదు..."

సీత జనార్దనాన్ని పరీక్షగా చూసి, "మీకు డబ్బుమీద మోజు కలిగింది, ఎందుకో చెప్పండి!" అంది.

"ఎందుకా?" బాధగా నవ్వాడు జనార్దనం. "నువ్వెలా పెరిగావో, ఎలా బ్రతికావో తెలిసినవాణ్ని. కేవలం నా కారణంగా నీ స్థితి దిగజారిపోయిందని తెలిసినవాణ్ని. నిన్ను మళ్ళీ పూర్వపు స్థాయికి తీసుకురావడం నావల్ల కాదని తెలిసినవాణ్ని. అనుక్షణం నేనెంత నరకాన్ననుభవిస్తున్నానో నీకు తెలియదు సీతా!"

"ఎందుకండీ - నాకు లేని బాధ!" అంది సీత.

"అవును - బాధ నీ కెందుకుంటుంది? త్యాగమూర్తిగా నీ కెలాగూ పేరు వచ్చింది. నా మూలంగానే కదా నువ్వీ త్యాగం చేశావు? నీ త్యాగం నన్ను ప్రతినిత్యం దహించి వేస్తోంది!" అన్నాడు జనార్దనం.

"అంత పెద్దమాటలు వాడకండి. మీ రింత బాధ పడుతున్నట్లు నాకు తెలియదు. మా నాన్నగారి మనసు మారి, మీకూ ఆయనపట్ల మోజుగా వుంటే, అందరికీ అంగీకారంగా వుండే ఒప్పందం రేపు కుదురుస్తాను. మీ రేమీ

బాధపడకండి!'' అంది సీత. ''ఎటొచ్చీ ఆ షేర్ల కాగి తాలూ, ఆ డబ్బూ అన్నీ మీరు తక్షణం ఆయన కిచ్చేసి రండి. రేపు నేనే ఆయన్ను కలుసుకుని మాట్లాడుతానని చెప్పండి.''

# 11

మర్నాడుదయం సీత హోటలుకు వెళ్ళి తండ్రిని కలుసుకుంది. ఇద్దరూ ఏకాంతంగా చాలాసేపు మాట్లాడుకున్నారు. తర్వాత ఇద్దరూ బ్యాంకుకు వెళ్ళారు. అక్కడ చాలాసేపు వ్యవహారాలు చేశారు. ఆ తర్వాత ఇద్దరూ విడిపోయారు. సీత తిన్నగా ఆఫీసుకు వెళ్ళి భర్తను కలుసుకుంది.

''మీ కోరిక నెరవేరింది. మీరు కోరిన విధంగా మీరు మీ సీతను మెయింటైన్ చేయగలుతారు'' అంది సీత.

''ఏం జరిగిందః?'' అన్నాడు జనార్దనం ఉత్సాహంగా.

''ఏముంది? మానాన్నగారు నిజంగానే మారిపోయారు. ఆ విషయం ఈ రోజే గ్రహించాను నేను. ఆ షేర్లూ ఆ డబ్బూ అన్నీ తిరిగిచ్చేశారు. ఇప్పుడు నా పేరు మీద బ్యాంకులో అయిదు లక్షలు ఫిక్స్‌డ్ డిపాజిట్లో వేశారు. నెలనెలా మనకు కొన్ని వేలు వడ్డీగా వస్తుంది. కరెంట్ అకౌంట్లో మూడు లక్షలు క్యాష్ వేశారు. సాయంత్రంలోగా కారు మీ ఆఫీసుకు వస్తుంది. ఇదీ పరిస్థితి! వ్యవహారం పూర్తి చేసుకు వచ్చాను'' అంది సీత.

జనార్దనం ముఖంలో చాలా ఆనందం కొట్టొచ్చినట్లు కనబడింది. అతను బదులుగా ఏమీ మాట్లాడకపోవడం చూసి ''మీ కళ్ళేం చెబుతున్నాయి మీ సంతోషాన్ని. అక్కడ నాన్నగారి కళ్ళూ అంతే. పాపిష్టిదాన్ని ఇంత

కాలం మీ ఇద్దర్నీ ఇంటికి ఆనందానికి దూరంచేశాను''
అంది సీత.

''అంతమాటనకు సీతా!'' అన్నాడు జనార్దనం.

''మరి నేను వస్తాను. ఈ శుభవార్త మీకు చెవులారా వినిపించిపోవాలనీ నా నోటితోనే స్వయంగా వీలైనంత తొందరగా చెప్పాలనీ ఇలా వచ్చాను. ఇంటికి వెళ్ళి మీ కోసం ఎదురు చూస్తూవుంటాను తర్వాగా వచ్చేయండి.''

''ఎందుకీ ఆఫీసింక, రిజైన్ చేసి వచ్చేస్తాను'' అన్నాడు జనార్దనం.

''ఆపని మాత్రం చేయకండి. ఇది మన కృషితో సంపాదించుకున్న ఉద్యోగం. అయాచితంగా వచ్చిన డబ్బును దర్జాగా ఖర్చు చేయడంలో తప్పులేదు కానీ, కేవలం దాని మీదనే ఆధారపడకూడదన్నది నా అభిప్రాయం''
అంది సీత.

''సరదాకన్నాను కానీ, ఉద్యోగాన్నెందుకు వదులుకుంటాను?'' అన్నాడు జనార్దనం.

సీత అక్కణ్ణించి కదిలింది. ఆమె అంత ఉత్సాహంగా లేదు, తండ్రి ఇచ్చిన డబ్బు గురించి భర్త అంతగా ఉత్సాహపడడం ఆమెకు నచ్చలేదు.

ఆమె ఇంటి కెళ్ళేసరికి వీధి తలుపులు బార్లా తీసి వున్నాయి. హంతకుడు వీధి గదిలో కూర్చుని వున్నాడు.

''ఎన్నడూ లేనిది, చెల్లా యీరోజు చాలా సేపు పెత్తనాలు చేసి వచ్చిందే!'' అన్నాడు హంతకుడు ఆశ్చర్యాన్నభినయిస్తూ.

''నిజమే కానీ, ఇది నీ స్థలం కాదు గదా, నీకోసమని వేరే గది ఏర్పాటు చేసినప్పుడు నువ్వెక్కడెందుకు

కూర్చున్నావ్?'' అంది సీత చిరాగ్గా.

''బాగుంది ఇదేమన్నా హోటలా, నాగదిలో తప్ప మసలకూడదనడానికి. ఈ ఇంటికి అతిధిగా వచ్చాన్నేను. నాకో గది ఇచ్చారు. పడుకునేందుకూ, ప్రయివేటు వ్యవహారాలకూ ఆ గది తప్పితే మిగతా ఇంట్లో మసలకూడదని లేదు గదా'' అని ఒక్క క్షణం ఆగి, ''చెల్లాయ్ ఈ రోజు నాకే పనీ లేదు. మీ ఆయనతో పాటు నువ్వు బయటకు వెడితే ఇంత సేపటిదాకా రావనుకోలేదు. ఏం తోచలేదు. ఓగంట క్రితమే వీధి తలుపులు తీసుకుని కూర్చున్నాను'' అన్నాడు.

సీత ఏమి మాట్లాడలేదు.

''పొద్దున మీతోపాటు చేసిన భోజనం ఒట్టుగా ఇంకేమీ తినలేదు. హోటలుకు వెడదామనుకుంటే నీ చేతి వంట రుచి చూచినప్పట్నించీ హోటలు కూడు తినలేకుండా వున్నాను. నువ్విప్పుడు పకోడీలు వేస్తానంటే తింటాను. లేదంటే టిఫిన్ మానేస్తాను అంతే!'' అన్నాడు హంతకుడు.

సీత నవ్వుకుంది. హంతకుడికి వాక్చాతుర్యం వుంది. ఆమె మరి మాట్లాడకుండా లోపలకు వెళ్ళి తన పనులలో నిమగ్నురాలైంది. నిజంగా, మనస్ఫూర్తిగా పకోడీలు తయారు చేసింది. అవి రెడీ అయ్యే సమయానికి ఆఫీసునుంచి భర్త కూడా వచ్చాడు.

జనార్దనం వస్తూనే సినిమా ప్రోగ్రాం అన్నాడు. సీత కాదనలేదు కానీ, హంతకుడు తనూ వస్తానన్నాడు. జనార్దనం ఏమీ అనలేదు. అందరూ త్వరగా తెమిలి సినిమాకు బయల్దేరారు.

సినిమా మధ్యలో హంతకుడు లేచి జనార్దనం భుజం

తట్టి "అనుకోని బేరం తగిలింది. నేను వెడుతున్నాను" అని వెళ్ళిపోయాడు. జనార్దనం సంతోషించాడు. తను సీతతో మరింత ఫ్రీగా కబుర్లు చెప్పవచ్చునని అతనికి తోచింది.

ఇంటర్వెల్లో ఒకతను సీతను పలకరించాడు. జనార్దనానికి అతనెవరో తెలియలేదు. కానీ, సీత అతన్ని గుర్తుపట్టి పలకరించింది. హాల్లో మళ్ళీ దీపాలారేక సీత అతని గురించి చెప్పింది. అతనిది సీత ఊరేనట. సీతను ప్రేమించాడట. తనకు పెళ్ళయ్యేవరకూ ప్రేమిస్తూనే వున్నాడట.

"ఇప్పుడు పెళ్ళయిందా అతనికి?" జనార్దనం కుతూహలంగా అడిగాడు.

"లేదు అతని సంగతి నాకు పూర్తిగా తెలుసు. బాగా డబ్బున్న ఆడదాన్ని వల్లో వేసుకోవాలని చూస్తున్నాడతను. అతని ప్రేమ నామీద కాదు. నా డబ్బుమీద. ఆ సంగతి నాకు తెలియదని అతని ఉద్దేశ్యం. డబ్బున్న అమ్మాయి దొరికితే రెండో పెళ్ళిదాన్నయినా ఆఖరికి పిల్లల తల్లినైనా సరే చేసుకునేందుకు సిద్ధం" అంది సీత నవ్వుతూ.

జనార్దనం ఆలోచనలు మరో రకంగా పోయాయి. సీత ఇప్పుడు ఇదివరకటి సీత కాదు. ఆమె పేరున చాలా డబ్బుంది. ఆమె ఇదివరకులా ప్రవర్తించక పోవచ్చు. ఆమెను తనేమీ వారించకపోవచ్చు. డబ్బున్న ఆడదాని ప్రవర్తన ఎలాగుంటుంది?

అతనికి లలితారాణి గుర్తుకొచ్చింది!

ఆ తర్వాత అతను సినిమా సరిగా చూడలేకపోయాడు. ఇద్దరూ ఇల్లు చేరుకునే సరికి సుమారు పదయింది.

"నువ్వు పెళ్ళి విషయం ఆలోచించకుండా ఇలా రోజులు గడిపెయ్యటం మంచిగా లేదు. ప్లీజ్...తొందరగా వివాహం చేసుకో!" అందామె.

"ఎవర్ని?"

మందహాసం చేసింది సుప్రియ. "నన్ను మాత్రం కాదు. అంతటి స్వార్థం నాకు లేదు. నీకు నచ్చిన యువతిని చేసుకో!"

"నీ సలహాకి కృతజ్ఞతలు. కానీ, అటువంటి యోచనలు చెయ్యటం లేదు ప్రస్తుతం నేను. ఇంకో రెండు సంవత్సరాలవరకు పెళ్ళిగురించి ఆలోచించకూడదని నిర్ణయించుకొనివున్నాను."

ఆ తర్వాత మాట్లాడలేదు సుప్రియ. ఇద్దరూ డాన్స్ మాని, రెస్టారెంట్ బార్ సెక్షన్ వైపు వెళ్ళబోయారు. ఇంతలో ఓ బలమైన హస్తం విమల్ భుజం మీద పడింది. వెనుదిరిగి చూశాడు విమల్. ఆరడుగుల ఆరు అంగుళాల ఎత్తున్న దృఢకాయుడు కన్పించాడు.

"హల్లో, అభిమన్యూ!" నవ్వుతూ పలకరించాడు విమల్ ఆ దృఢకాయుణ్ణి. "మనం కల్సుకుని చాలారోజులైంది."

అవునన్నట్లు తల పంకించాడు అభిమన్యు.

సుప్రియను తన ఫ్రెండ్ కి పరిచయం చేశాడు విమల్ ముగ్గురూ బార్ సెక్షన్ లోకి వెళ్ళి, ఒక మూల బల్లముందు కూర్చున్నారు. సప్లయిర్ వచ్చిన వెంటనే విస్కీ ఆర్డరిచ్చాడు అభిమన్యు.

హాట్ డ్రింక్ బల్లమీదకు వచ్చింది.

"మిస్టర్ అభిమన్యూ! మీరు చాలా అందంగా వున్నారు" విస్కీ కాస్త సిప్ చేసి గ్లాసును బల్లమీదుం

చింది సుప్రియ. "ఎంత అందంగా వున్నారో తెలుసా?"

"చెప్పండి!" సిగరెట్ వెలిగించుకున్నాడు అభిమన్యు.

"మగాళ్ళు అందంగా వుంటారని నాకు తెలుసు. కాని, ఎంత అందంగా వుంటారో ఇప్పుడు తెలుస్తోంది. ఇది పొగడ్త కాదు. మీవంటి హాండ్‌సమ్ చాప్‌ని నేను చూడటం ఇదే మొదటిసారి."

చిన్నగా నవ్వాడు అభిమన్యు — తన సమాధానం అదే నన్నట్లు.

"ప్రియా!" విమల్ పెదవులు కదిలించాడు. "నీవు కొండచిలువవంటి దానివి. నీ దృష్టిలో పడిన మగాడు తప్పించుకోలేడు. ఒప్పుకుంటాను. కానీ, అభిమన్యు విష యంలో ఎందుకైనా మంచిది, కాస్త జాగ్రత్తగావుండు. వాడొక హై ఎక్స్‌ప్లోజివ్. ఆల్ రౌండ్ ప్లేయర్. జేబు దొంగలు మొదలుకొని హంతకులవరకు వాడి స్నేహితులు వున్నారు."

"యూ నాటీ!" బల్లక్రిందున్న విమల్ కాలు తొక్కింది సుప్రియ కసిగా.

"ఇట్సాల్ రైట్!" నవ్వేశాడు విమల్. "నాకు వేరే ఎంగేజ్‌మెంట్ వుంది. మీరిద్దరూ ఎంజాయ్ చెయ్యండి. బై!" సమాధానం ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు.

"మా జాతి మీద మీ అభిప్రాయం ఏమిటి?" అడి గింది సుప్రియ గ్లాసులోకి విస్కీ ఒంపుకొని.

"మీ జాతి అంటే...?"

"ఆడజాతి."

బల్లమీదున్న ఏష్ట్రేలో సిగరెట్ నుసి రాల్చాడు

అభిమన్యు. "ప్రియా! మనమధ్య మన్నించి మాట్లాడుకోవడం అవసరమని నేననుకోవటం లేదు. ఇహ నీ ప్రశ్నకు సమాధానం విను. ఆడదానికి, ఆఫ్రికన్ కోబ్రాకి పెద్దగా తేడా వున్నట్టు నా కనిపించలేదు. మహాసామ్రాజ్యమైనా పతనమైపోవడానికి ఆడదాని కన్నీటి బొట్టు ... లేదా చిర్నవ్వు ఒక్కటి చాలు!"

నవ్వింది సుప్రియ. "అ...భి...మ...న్యు..." మళ్ళీ నవ్వింది. "మన స్తత్వంలాగే మీ పేరుకూడా విచిత్రంగానే వుంది డియర్, మే ఐ నో వాట్ ఆర్ యు?" అడిగింది.

"జేబులు కొడతాను. ఓపిక చిక్కిన ప్రతిసారీ దోపిడీలు కూడా చేస్తుంటాను. మరి నీ సంగతి?"

"నేనొక నింఫోమానియాక్ ని."

ఆమె డేర్ నెస్ కి ఆశ్చర్యపోయాడతను. "అంటే ఒకే మగాడితో, ఒకే విధమైన సుఖంతో సరిపెట్టుకోవడం నీకిష్టం లేదన్నమాట."

"అన్నమాట కాదు, ఉన్నమాటే!" అతని చేతివ్రేళ్ళ మధ్యవున్న సిగరెట్ లాక్కుని, రెండు దమ్ములు లాగి తిరిగి యిచ్చేసింది సుప్రియ. "కాని, జీవితాన్ని తేలిగ్గా తీసుకొని, నిర్లక్ష్యంగా బ్రతికే నీవంటి ప్లే బోయ్స్ అంటే ఎక్కువ యిష్టం చూపుతుంటాను. నిన్ను చూశాక ఇటుపై మగాళ్ళను మార్చే అవకాశం వుండదేమో అన్పించింది."

ప్రసంగం కావాలనే మార్చాడు. "ఈ క్లబ్ కి తరచుగా వస్తుంటావా?"

"ప్రతిరోజూ వస్తాను. రాకుంటే నాకే నష్టం."

మరో అరగంట తర్వాత ఇద్దరూ బార్ లోంచి బయటకు వచ్చారు.

అభిమన్యు చేయి అందుకొని నొక్కింది సుప్రియ. "నీతో కల్సి డాన్స్ చెయ్యడానికి నేను యిష్టపడుతున్నాను."

"సారీ, ప్రియా! బార్‌లో బిల్లు చెల్లించడంతో నాపర్స్ ఖాళీ అయ్యింది. తొందరగా ఏదో ఒక జేబు వెతుక్కోవాలి. లేకుంటే నేను ఇబ్బంది పడాల్సివుంటుంది. నీకోరిక మరోసారి తీరుతుంది గుడ్ బై!"

క్లబ్‌లోంచి బయటకొచ్చాడు అభిమన్యు. పేవ్ మెంట్ మీద నిలబడి సిగరెట్ వెల్గించుకున్నాడు.

"డియర్!"

తల తిప్పి చూశాడు. సుప్రియ కన్పించింది. "కమ్ నియర్" అన్నాడు నవ్వుతూ.

అభిమన్యు దగ్గరగా వచ్చి, అతని చేయి అందుకుంది సుప్రియ. "నీ హస్తకౌశలం చూడాలనివుంది."

"అదేమంత భాగ్యం? పద."

ఇద్దరూ పేవ్ మెంట్ మీద అడుగులెయ్యసాగారు.

అభిమన్యు ఎవరి జేబు కత్తిరిస్తాడో, ఎలా కత్తిరిస్తాడో చూడాలని వుబలాట పడుతోంది సుప్రియ.

రాత్రి ఎనిమిది గంటలు దాటి ఎనిమిది నిమిషాలైంది. రోడ్లమీద ట్రాఫిక్ అధికంగా వుంది. పేవ్ మెంట్స్‌మీద కాలినడకన వెళ్తున్నవారి సంఖ్యకూడా అధికంగానే వుంది.

# 3

తన ఎదురుగా మరొక సోఫాలో కూర్చునున్న ఏస్ట్రోనాట్స్‌ని పరిశీలనగా చూశాడు గ్రౌండ్ కంట్రోల్ డైరెక్టర్.

ఏస్ట్రోనాట్స్ వినోద్, శర్మ, మైథిలి నేల చూపులు చూస్తున్నారు.

"మిస్ మైథిలీ!" నెమ్మదిగా పిలిచాడు జి. సి. డి. ధనంజయ్ అభ్యంకర్.

నెమ్మదిగా తల ఎత్తింది మైథిలి.

"వీరాభిమన్యు ప్రయోగం ఎటువంటి పరిస్థితుల్లోనూ ఆగ కూడదని గౌరవనీయులైన మన ప్రధాని అన్నారు. నా అభిప్రాయం కూడా అదే. పత్రికలవాళ్ళకి కావలసినంత మేటర్ చిక్కేలా ప్రవర్తించకండి. శాటిలైట్ ప్రయోగం మానితే సభ్యదేశాల దృష్టిలో మన విలువ తగ్గే ప్రమాదం వుంది. మీ భయం ఏమిటో చెప్పండి. శత్రుగూఢచారులు గాని, ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలు సాగించే వ్యక్తులు గాని ఎవరైనా మిమ్మల్ని బెదిరించారా? అసలు ఏం జరిగింది? వివరంగా చెప్పండి."

పమిటతో ముఖం తుడుచుకుంది మైథిలి. "శాటిలైట్ అంతరిక్షంలోకి ఇప్పట్లో ప్రయోగింపబడటం మాకు ఇష్టం లేదు. డియర్ సర్! జరిగింది చెబుతాను. దయచేసి మమ్మల్ని కాపాడండి. మూడు మాసాల క్రితం ప్రయోగింపబడిన 'భాగ్యరేఖ' రాకెట్ సెంటర్‌ని వదిలి పైకి లేచిన వెంటనే మనం అందరూ చూస్తుండగానే నేల కూలిపోయిన దృశ్యం ఇంకా నా కళ్ళ ముందు మెదులుతూనే వుంది. ఆ దుర్ఘటనకి గ్రౌండ్ కంట్రోల్‌లోని కొన్ని సాంకేతిక లోపాలు కారణమని మీరు నిరూపించారు.

అసలు కారణం అది కాదు. ఎవరో కావాలని మన భాగ్యరేఖని ధ్వంసం చేశారు. రెండు రోజుల క్రితం గుర్తు తెలియని వ్యక్తి ఒకతను నాకు ఫోన్ చేశాడు. 'ఈ నెల

పద్ధెనిమిదవ తారీఖున అంతరిక్షంలోకి ప్రయోగింపబడనున్న శాటిలైట్ విషయం మర్చిపో. నీ తోటి వ్యోమగాములకు కూడా పరిస్థితి వివరించి, నీ ప్రాణాలతోబాటు వారి ప్రాణాలుకూడా కాపాడు. లేకుంటే ఏం జరుగుతుందో తెలుసా? భాగ్యరేఖకి పట్టిన గతి చూశావు కదా! ఇదీ అంతే!' అని చెప్పి లైన్ కట్ చేశాడు.

సర్, మా ప్రాణాల సంగతి అలా వుంచండి. 'వీరాభిమన్యు' నిర్మాణానికి ప్రభుత్వం కోట్లు ఖర్చు చేసింది. ఆ శాటిలైట్ ధ్వంసం కావడం మాకిష్టంలేదు. దయచేసి మమ్మల్ని క్షమించండి. శాటిలైట్ ప్రయోగం ప్రస్తుతానికి వాయిదా వేయండి."

"నాన్సెన్స్!" విసుక్కున్నాడు జి. సి. డి.

మైథిలి బాధగా ముఖం చిట్లించింది. జి. సి. డైరెక్టర్ తనమాటలు విశ్వసించలేదేమోననే అనుమానం ఆమెకు కలిగింది.

"ఇటీజ్ జస్ట్ నాట్ పాజిబుల్ టు డిస్ట్రాయ్ అవర్ శాటిలైట్. థియరిటికల్ విషయం అలా వుంచితే ప్రాక్టికల్‌గా అది అసాధ్యం" ఆవేశంగా చెప్పుకు పోతున్నాడు జి. సి. డి.

"ఒక శాటిలైట్‌ని ధ్వంసం చెయ్యాలంటే మరొక శాటిలైట్‌ని ప్రయోగించాలి. ఎ. ఎ. సి. గన్స్ విషయం మర్చిపోవచ్చు — ఇహ పోతే ఇంటర్ కాంటినెంటల్ బాలిస్టిక్ మిస్సైల్స్ విషయం. వాటి వేగం కంటే మన శాటిలైట్‌కి నిర్దేశింపబడివున్న వేగం అధికం. అంటే 'వీరాభిమన్యు' ఆకాశంలో నాశనం చెయ్యబడటానికి వున్న అవకాశాలు చాలా తక్కువ.

ఇహ రాకెట్ సెంటర్‌లోనే శాటిలైట్ ధ్వంసం

చెయ్యబడటం గురించి వినండి. అది మీకు సంబంధించిన వ్యవహారం కాదు. రాకెట్ సెంటర్ గ్రౌండ్ సెక్యూరిటీ ఫోర్స్ ఆ గొడవ చూసుకుంటుంది. శాటిలైట్ ప్రయోగం జరిగేవరకు దాన్ని కాపాడాల్సిన బాధ్యత గ్రౌండ్ సెక్యూరిటీ ఫోర్స్‌ది.

ఇహపోతే, భాగ్యరేఖ ధ్వంసం అయిన విషయం తీసుకుందాం. భాగ్యరేఖలో వెళ్ళిన ఏస్ట్రోనాట్స్ విధివంచితులు. దురదృష్టం అనుకోకుండా వారి పతనాన్ని కాంక్షించింది. భాగ్యరేఖ గైడెన్స్ అండ్ నావిగేషన్ బృందంలో కొందరు శత్రుగూఢచారులు వుండి, భాగ్యరేఖను ధ్వంసం చేయగలిగారు. శత్రుగూఢచారుల్ని ప్రభుత్వం ఏరివేసింది.

గ్రౌండ్ కంట్రోల్‌ని ఇప్పుడు మీరు నమ్మవచ్చు! వీరాభిమన్యు ప్రయోగం అనుకున్న విధంగానే ఈ నెల పదెనిమిదవ తారీఖున జరిగిపోతుంది. మీకీర్తి శాశ్వతంగా నిల్చిపోతుంది. స్పేస్ టెక్నాలజీలో అర్థికాభివృద్ధి సాధించాలని చూస్తున్న ప్రభుత్వంతో సహకరించండి. బెదిరింపు ఫోన్ కాల్స్, వుత్తరాలో అందాయని కర్తవ్యాన్ని మరిచి ప్రవర్తించకండి. మును పే అనుకున్న సమయానికి 'వీరాభిమన్యు' ప్రయోగింపబడకుంటే అవమానం. మనకు కాదు, దేశానికే అది తీరని అవమానం.

చిన్నగా దగ్గాడు వినోద్. "సర్! మమ్మల్ని మృత్యుముఖానికి పంపటానికి మీరు పడుతున్న అవస్త చూస్తుంటే నాకు జాలేస్తోంది."

"స్టాప్ ది నాన్సెన్స్!"

"వినోద్ నిజమే చెప్పాడని నా కనిపిస్తోంది" గొణిగాడు శర్మ.

"మాకు బ్రతకాలని వుంది." చేతి గోళ్ళకున్న రంగు కేసి చూసుకుంటూ మాట్లాడింది మైథిలి.

"ఆల్ రైట్! మీకు ఇరవై నాలుగు గంటల వ్యవధి ఇస్తున్నాను. బాగా ఆలోచించి అపుడు చెప్పండి మీ అభిప్రాయం" విసురుగా లేచాడు జి. సి. డి. ధనంజయ్.

# 4

అభిమన్యు, సుప్రియ ఏవో కబుర్లు చెప్పుకుంటూ పేవ్ మెంట్ మీద అడుగులేస్తున్నారు.

ఐదు నిమిషాల తర్వాత అభిమన్యు ప్రదర్శించిన హస్త కౌశలం సుప్రియని ఆశ్చర్యపర్చింది. అతను ఆ వృత్తిలో ఎంత రాటుదేరి వున్నాడో ఆమెకు ఆ క్షణాల్లోనే అర్థమైంది.

"మిస్టర్, అభిమన్యు! నీ కభ్యంతరం లేకుంటే నా ఎపార్ట్ మెంట్ కి వెళ్దాం" హఠాత్తుగా అన్నది సుప్రియ.

"అభ్యంతరం వుంది" బలంగా సిగరెట్ దమ్ము లాగాడతను! "ప్రియా! ఇందాక నీలిరంగు ఆక్స్ ఫర్డ్ సూట్ వాలాని నేను ఢీకొన్నాను. పరస్పరం క్షమాపణ చెప్పుకున్నాం. ఆ క్షణాల్లోనే అతని పర్సు నేను కాజేశాను. అఫ్ కోర్స్...ఆ సంగతి నీకు తెల్సివుండదని, నీవు చూసి వుండవని నేను అనుకోవటం లేదు. నాకు కాసేపు కంపెనీ ఇచ్చావ్. కృతజ్ఞుణ్ణి. నీ బిల్ పే చెయ్యగలను ప్రస్తుతం ఎంత?"

"డార్లింగ్! మన మధ్య స్నేహం కాకుండా వ్యాపారం చోటు చేసుకోవడం నా కిష్టం లేదు."

"సారీ ప్రియా! నీ ఇంటికి మరోసారి వస్తాను. ఇప్పటికి నన్ను వదిలెయ్."

ఇద్దరూ సమీపంలో నున్న బస్ స్టాప్ ని చేరుకున్నారు.

జేబులోంచి పర్సు తీశాడు అభిమన్యు. దాని లోప లున్న నోట్లు తీసి లెఖ్ఖ పెట్టాడు. తొమ్మిదివందల ఏభై రూపాయలు. అన్నీ పదిరూపాయల నోట్లే. చిల్లర డబ్బులు కూడా వదల్లేదు వీరాభిమన్యు. అరవై రెండు పైసలు. పర్సు ఖాళీ చేసి, చీకట్లో విసిరేశాడు.

ఇరవై నోట్లు సుప్రియకిచ్చాడు. "గుడ్ నైట్."

"జస్ట్ మినిట్..."

ఆగి ఏమిటన్నట్లు చూశాడు.

"చివరికి చిల్లర డబ్బులుకూడా వదల్లేదు. అరవై రెండు పైసలు నీకు లెఖ్ఖకాదు. అయినా వదల్లేకపోయావ్. డబ్బంటే నీ కంత ప్రేమా?" అడిగింది నవ్వుతూ.

"ప్రేమ కాదు స్వార్థం..." కొత్త సిగరెట్ వెలి గించుకున్నాడు అభిమన్యు. "తొంభై తొమ్మిది పైసలు వున్నా, అవి రూపాయ అని అనిపించుకోలేవు. ఇది కలి యుగం ఇందులో హీనులు, వున్నతులు ఎప్పటికీ వుంటుం టారు. ఎవరు ఎంత మేర విజృంభించటం అనేది వారి నైజం మీద, ప్రొఫెషన్ మీద ఆధారపడి వుంటుంది. ఒక చిన్న వుదాహరణ విను.

ప్రథమ భారత స్వాతంత్ర్య సమర మనబడే 'సిపా యిల కలహం' గురించి మేరియమ్ అనే ఆవిడ 1896లో వారణాసి నుంచి ఒక పుస్తకం ప్రచురించింది. 1857 మే నెల 10వ తేదీన మీరట్ తిరుగుబాటు జరిగే నాటికి ఆమె పదిహేనేళ్ళ పిల్ల. తండ్రి షాజహాన్ పూర్ మేజి స్ట్రేటు కోర్టులో ఉద్యోగి. ఆమె యూరేషియన్. అంటే తల్లి ఇండియను, తండ్రి ఆంగ్లేయుడూను.

షాజహాన్‌పూర్‌లో జూన్ నెల మొదటి ఆదివారం ఉదయం ఏడున్నరకి మేరియమ్ తండ్రి, ఆ జిల్లా కలెక్టరు, జిల్లా మెడికల్ ఆఫీసరు చర్చి భవనంలో కిరాతకంగా తిరుగుబాటుదారుల చేత హత్య గావింపబడ్డారు. తన తండ్రి మృతదేహాన్ని కడసారి చూసే అవకాశం మేరియమ్‌కి కలగలేదు. ఎందుకంటే తెల్ల చర్మం కన్పించగానే స్త్రీ, పురుష, బాల్య, వృద్ధ విభేదం లేకుండా ఊచకోత కొయ్యబడుతున్న గడ్డురోజులవి.

మూడు రోజులవరకు ఆమూడు మృతదేహాలు అక్కడే పడున్నాయ్. కాని, వారిజేబుల్లోని డబ్బులు, కాళ్ళకున్న బూట్లు మాత్రం ఎవరో దొంగిలించుకుపోయారు.

ఈ లోకంలో స్వార్థం అనేది ఎక్కడ చూసినా కన్పిస్తుంది. శవాలను నిలువు దోపిడి చేసే స్వార్థపరుల కంటే నేనే నయం ఒకవిధంగా. ప్రియా! నెక్స్ టైం బెటర్ లక్, గుడ్ నైట్!''

''గుడ్ నైట్'' అప్రయత్నంగా బదులిచ్చింది సుప్రియ.
అభిమన్యు చప్పట్లు కొట్టి అటుగా వెళ్తున్న టాక్సీని ఆపాడు. టాక్సీ పేవ్‌మెంట్ ప్రక్కకొచ్చి ఆగింది.

అభిమన్యు చకచక అడుగులేస్తూ టాక్సీని సమీపించాడు.

# 5

''హల్లో హాండ్‌సమ్!''

ముబారక్ నైట్‌క్లబ్ పోర్టికోలో ఆగిన టాక్సీనుండి క్రిందకు దిగిన అభిమన్యు తలతిప్పి వెనక్కు చూశాడు. సుప్రియ కన్పించింది.
''హల్లో, బేబీ!'' పలకరించాడు నవ్వుతూ.

ఎంట్రన్స్ డోర్ ముందున్న ప్లాట్ ఫాం మీదున్నది సుప్రియ. అభిమన్యు కన్పించగానే ఆమెలో నూతనోత్సాహం వెల్లివిరిసింది. ఎత్తుమడమల జోళ్ళు టకటక లాడించుకుంటూ మెట్లుదిగి, పోర్టికోలోనున్న అభిమన్యు ప్రక్కకొచ్చి, అతని చేయి అందుకుంది.

"రాత్రి ఎనిమిది గంటలుకూడా కాలేదు. అప్పుడే నైట్ క్లబ్ మీదకు గాలి మళ్ళిందా?" అడిగింది మందహాసాన్ని వెదజల్లుతూ.

"గాలి మళ్ళినమాట నిజమే. క్లబ్ మీదకు కాదు. నీపైకి."

"అబద్ధం."

"అబద్ధాలాడటం అంటే నాకసహ్యం" స్వరం బాగా తగ్గించి సుప్రియకు మాత్రమే విన్పించేలా చెప్పాడు అభిమన్యు. "పోలీసులకు మాత్రమే నేను అబద్ధాలు చెప్తూంటాను."

"అచ్ఛా!" బుగ్గలు సొట్టలుపడేలా నవ్వింది ఆమె. "నిన్న అంతసేపు బ్రతిమాలినా మా ఇంటికి రాలేదు. ఇప్పుడు 'పనిగట్టుకొని నాకోసం ఇక్కడకు వచ్చావంటే నమ్మలేకపోతున్నాను."

"చచ్చిన నిన్నగురించి యోచించక! పుట్టని రేపు సంగతి ఇపుడు మన కవసరంలేదు. ఈవేళ మీ ఇంటికి వస్తాను. ఇంకా నీవు ఏం చెప్పినా చేస్తాను. ఎక్కడకు రమ్మన్నా వస్తాను. లెట్స్ గో!"

"ఎక్కడికి?"

"నీ ఇష్టం."

"చాలా సంతోషంగా వున్నావ్. బరువైన పర్సు

ఎక్కడైనా చిక్కిందేమిటి?''

''పర్సు కాదు. డైమండ్ నెక్లెస్. అమ్మేసరికి పన్నెండు వేలు వచ్చాయ్. ఆ ఆనందాన్ని నీతో కలిసి పంచుకోవాలని వచ్చాను.''

''థాంక్స్, డార్లింగ్ ...'' అభిమన్యు చేయిపట్టుకొని క్లబ్ ఆవరణంలోంచి బయటకు లాక్కుపోవాలని చూసిందామె.

ఆమె భుజంమీద చేయివేసి ఆపుచేశాడు అభిమన్యు.

''టాక్సీలో వెళ్దాం.''

''విత్ ప్లెజర్.''

ఇందాక అభిమన్యు వచ్చిన టాక్సీ ఇంకా క్లబ్ పోర్టికోలోనే వుంది. ఇద్దరూ దానిలోకి చేరుకున్నారు.

డ్రైవర్‌కి ఏదో చెప్పింది సుప్రియ.

టాక్సీ కదిలింది.

సిగరెట్ వెలిగించుకొని సీట్లో విశ్రాంతిగా వెనక్కు వాలాడు అభిమన్యు. అతని భుజానికి తన భుజాన్ని తాకిస్తూ ప్రక్కనే కూర్చొని వుంది సుప్రియ.

చాణక్యపురికేసి వేగంగా దూసుకెళ్తోంది టాక్సీ.

''ప్రియా!'' పిలిచాడు అభిమన్యు.

ఏవో ఆలోచనల్లో మునిగున్న సుప్రియ తృళ్ళిపడింది.

''యస్... ఏమిటి?'' అడిగింది తల తిప్పుతూ.

''ఒకే మగాడితో జీవితాన్ని పంచుకోవడంలో స్త్రీకి ఆనందం, మనశ్శాంతి వున్నాయ్. నీవు ఆ దారిలో వెళ్ళటం లేదు. భయంకరమైన త్రోవగుండా నడుస్తున్నావ్. ఎందరో పురుషులు నీకు పరిచయమై వుండొచ్చు. అయినా అందరూ పరాయివాళ్ళే. తన అనే మగవాని అవసరం స్త్రీకి ఎంతైనా వుంది.''

తేలిక భావం వ్యక్తమయ్యేలా నవ్విందామె.

"స్వార్థపరులు ఆ విధంగానే యోచిస్తారు - ఆచరిస్తారు కూడా. నా కా జీవితం నచ్చదు."

"వాడ్డుయు మీన్?"

సుప్రియ పెదవులు కదిలాయ్.

"అయం నిజః పరోవేతి గణనాం లఘు చేతసాం!
ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం!!"

ఆశ్చర్యపోయాడు అభిమన్యు.

సుప్రియను తను తక్కువగా అంచనా వేసుకున్నట్టు అతని కర్థమైంది.

ఆమె పెదవులు తిరిగి కదిలాయ్. "ఇతడు మన, అతడు పరాయి అనే భేదబుద్ధి అల్పమనస్కులకేగాని, విశాల హృదయులకు లోకమంతయు స్వకుటుంబమే."

"నీ ప్రొఫెషన్ని సమర్థించుకుంటున్నావేమో!"

"అటువంటిదేం లేదు. చాలా రోజులుగా నేను ప్రాస్టిట్యూట్ గానే జీవిస్తున్నాను. డార్లింగ్! నీవు నాకు నచ్చావ్. నీకు అభ్యంతరం లేకుంటే ఈ నిమిషంనుంచి మనం ఒకే ప్రాణంలా జీవించవచ్చు!"

"అది జరగని పనేమో!"

"ఏం?"

"నేను క్రిమినల్ని. అంటే యాంటిసోషల్ ఎలిమెంట్ నన్నమాట. మనమధ్య సఖ్యత కుదరదు."

సుప్రియ ఏదో చెప్పబోయి, టాక్సీ ఆగటంతో మౌనం వహించింది.

ఇద్దరూ టాక్సీనుండి క్రిందకు దిగారు. ఫేర్ అభిమన్యు చెల్లించాడు. టాక్సీ రివర్స్ అయి వెళ్ళిపోయింది.

ఎదురుగా పెద్ద ఇల్లు వుంది. దాన్ని అనేక ఫ్లాట్స్‌గా చేసి అద్దెలకు ఇచ్చినట్లు చూస్తూనే తెలుస్తోంది.

ఫ్లాట్ నెంబర్ 'క'లోకి దారితీసింది సుప్రియ. లోపల రెండు గదులున్నాయ్. ముందు గది కాస్త పెద్దది. రెండవది బెడ్‌రూం. దానిలోంచి బాత్రూంకి దారి వుంది.

ముందు గదిలోని ఫర్నీచర్‌ని గోడలమీద వ్రేలాడుతున్న రవివర్మ డూప్లికేట్స్‌ని చూస్తూ సుప్రియ వెనుకే పడగ్గదిలోకి నడిచాడు అభిమన్యు.

ఈ గది మరీ విశాలంగా లేకపోయినా నీట్‌గా వుంది. గోడలకు లేత నీలిరంగు ట్రాన్స్‌పరెంట్ ఎనామిల్ పెయింట్స్, పంజాబీ సుందరీమణుల అర్ధనగ్న చిత్రపటాలు... గదిలో ఒక ప్రక్కగా పెద్ద డబుల్ ఫోం బెడ్, దానిమీద నాలుగు తలగడలు, దాని కవతలవైపుగా గోడవారగా చిన్నబల్ల, బల్లమీద ట్రాన్సిస్టర్, ఫోన్, బల్ల ప్రక్కనే పుస్తకాల రేక్... ఒక ప్రాస్టిట్యూట్ పడగ్గదిలా కన్పించటంలేదు ఆ రూం.

"ఎలా వుంది నా పడగ్గది?" అభిమన్యుని వెనుకనుంచి వాటేసుకుంది సుప్రియ. "నీకు నచ్చిందా?"

"చాలా బావుంది. ఈ ఫ్లాట్‌కి అద్దె ఎంతిస్తున్నావేమిటి?"

"రెండొందలు."

సుప్రియ భుజంపట్టుకొని ముందుకు లాక్కున్నాడు అభిమన్యు. జేబులోంచి వాలెట్ తీసి, పదివందరూపాయల నోట్లు లెక్కపెట్టి ఆమె కిచ్చాడు.

బదులు చెప్పకుండా నోట్లు అందుకుందామె.

"హాట్ డ్రింక్స్ వంటివి ఏవీ లేవా?"

"ఓడ్కా వుంది..." మంచం దగ్గరగా టీపాయ్ లాగి, ముందు గదిలోకి వెళ్ళింది సుప్రియ.

మంచంమీద కూర్చున్నాడు అభిమన్యు.

రెండు నిమిషాల్లో ఓడ్కా బాటిల్, గ్లాసులు తీసుకొని వచ్చింది సుప్రియ. ఇద్దరూ మౌనంగా ఒక రౌండు పూర్తి చేశారు.

సుప్రియ గ్లాసును టీపాయ్ మీదుంచి, లేచి ఒళ్లు విరుచుకుంది. అభిమన్యు చూస్తుండగానే ఒంటిమీదున్న దుస్తులు విప్పేసి, నైట్ డ్రస్ ధరించింది.

"స్టన్నింగ్ బ్యూటీ" అప్రయత్నంగా అన్నాడు అభిమన్యు.

కిలకిలా నవ్వుతూ వచ్చి, అభిమన్యుని వాటేసుకుంది సుప్రియ.

## 6

చేతికున్న వాచీలో టైం చూసుకున్నాడు ధనుంజయ్ అభ్యంకర్. రాత్రి ఎనిమిది గంటలైంది.

అతనికెదురుగా 'వీరాభిమన్యు' ఏస్ట్రోనాట్స్ ముగ్గురూ వున్నారు. ముగ్గురి గుండెల్లోనూ రైళ్లు పరుగెడుతున్నాయ్.

ధనుంజయ్ అభ్యంకర్ పెదవులు కదిలించాడు, సోఫాలో కొద్దిగా కదిలి.

"మీ కిచ్చిన గడువు ఇరవై నాలుగు గంటలు పూర్తయ్యింది. టెల్ మీ...ఏం నిశ్చయించుకున్నారు?" శాంతంగా అడిగాడు.

శర్మ సమాధాన మిచ్చాడు. "సర్! మీ కుమారుడు విమల్ అభ్యంకర్ నా ప్రాణస్నేహితుడు. మీకున్నది అతనొక్కడే సంతానం. నన్ను విమల్ స్థానంలో వుంచి

కాసేపు ఆలోచించండి. నేను విమల్ అయివుంటే... మీ కుమారుడైవుంటే ఇటువంటి పరిస్థితుల్లో నన్ను అంతరిక్ష యాత్రకి ప్రోత్సహించగలరా?"

"నీ సమాధానం ఏమిటి?" అభ్యంకర్ చూపులు వినోద్ పైకి తిరిగాయ్.

"నేను ఈ దేశ పౌరసత్వాన్నే వదిలెయ్యాలని అనుకుంటున్నాను. అయాం వెరీ సారీ."

"అమ్మాయ్! నీవు?"

మైథిలి గొణిగినట్లు మాట్లాడింది. "సహజ మరణం ప్రాప్తించే వరకు తన ప్రాణాలు కాపాడుకునే హక్కు ప్రతి ఒక్కరికీ వుంది. చారిత్రాత్మకంగా చావటానికి నేను సిద్ధంగా లేను. క్షమించండి."

మందహాసం చేసేడు అభ్యంకర్. "మీమనసు మారే వరకు మీకు స్వేచ్ఛవుండదు. మీరే నన్ను క్షమించాలి!"

అదిరిపడ్డారు ఏస్ట్రొనాట్స్.

"మిస్టర్ హితేశ్వర్" అరిచాడు అభ్యంకర్.

ప్రక్క గదితలుపు తెరుచుకుంది. రాకెట్ సెంటర్ గ్రౌండ్ సెక్యూరిటీ ఫోర్స్ కాప్టన్ హితేశ్వర్ ప్రత్యక్షమయ్యాడు గుమ్మంలో. అతని కుడిచేతిలో 9 ఎం. ఎం. ఆటోమేటిక్ వుంది.

"వీరు ముగ్గురూ మతి చలించి పిచ్చిపిచ్చిగా వాగుతున్నారు. ఆ గదిలోకి తోసి జాగ్రత్తగా కాపలా కాయండి!" ఆజ్ఞాపించాడు ధనుంజయ్ అభ్యంకర్.

మరమనిషిలా అడుగులేస్తూ ముందుకొచ్చాడు హితేశ్వర్ "అలాగా ముందు మీ వాగుడు మూయిస్తాను" అంటూ ఆటోమేటిక్‌ను ధనుంజయ్‌కు గురిపెట్టాడు.

# 7

అభిమన్యు చేతిపన్న వాచీలోంచి "బీప్...బీప్...క్లూమ్...క్లూమ్" అంటూ విన్పిస్తోంది. అది వాచీ మాత్రమే కాదు. బేటరీ ఆపరేటెట్ వైర్‌లెస్ ట్రాన్స్‌మిటర్ కూడా.

వాచీ కీరాడ్‌ని బయటకు లాగి, తిప్పిపెట్టాడు అభిమన్యు. వాచీ లోపలవున్న ప్రసారయంత్రం పని ప్రారంభించింది.

"హై కమాండ్ పోస్ట్ స్పీకింగ్...హై కమాండ్ పోస్ట్ స్పీకింగ్...కాలింగ్ అభిమన్యు...కాలింగ్ అభిమన్యు...ఓవర్!"

అభిమన్యు రిస్ట్‌వాచిని నోటిముందుకు తెచ్చాడు.

"అభిమన్యు రిసీవింగ్...అభిమన్యు రిసీవింగ్...హై కమాండ్ పోస్ట్...గో ఎహెడ్ ఓవర్!"

అభినుమ్యు ప్రక్కనే ఫోంబెడ్ మీద వెల్లకిలా పడుకొనివున్న సుప్రియకి ఆశ్చర్యంగా వుంది. అభిమన్యును తను చాలా తక్కువగా అంచనా వేసిందేమిటి?

ఐదు నిమిషాల్లో ట్రాన్స్‌మిషన్ ముగించాడు అభిమన్యు. కీరాడ్‌ని యధాప్రకారం అమర్చుకున్నాడు.

"డార్లింగ్!" అతని ఛాతీమీద చేతిని పోనిచ్చింది సుప్రియ ఇద్దరూ అర్ధనగ్నంగా వున్నారు.

"ఏమిటి?" అడిగాడు సిగరెట్ వెలిగించుకొని.

"హు ఆర్ యూ?"

"అభిమన్యు."

"అదికాదు. నీ వెనుక పెద్ద చరిత్ర వున్నట్టు నాకనిపిస్తోంది. ఇందాక ట్రాన్స్‌మీటర్‌లో ఎవరితోనో

మాట్లాడావ్. నీ రహస్యాలన్నీ తెల్సుకోవాలనిపిస్తోంది."

"అది జరుగదు. మన వృత్తులు వేరు కావటమే అందుకు కారణం."

"అంటే నీవు నన్ను నమ్మటం లేదా?"

"లేదు. ఒకరిని నమ్మటం నా వృత్తి ధర్మానికి విరుద్ధం."

నవ్విందామె. "మనం వేర్వేరు వృత్తుల్లో వున్నామని నేననుకోవటం లేదు."

ఆమెను దగ్గరగా లాక్కున్నాడు అభిమన్యు. "నీవు లోకాన్ని మోసపుచ్చటానికి ప్రాస్టిట్యూట్ గా నటిస్తున్నావ్ కదూ?"

"బాగా వూహించావ్, నీవు జేబుదొంగ కాదు నాలాగే లోకాన్ని నీవూ మోసగిస్తున్నావని నా అనుమానం."

"యస్!"

అభిమన్యు పెదలమధ్య ఇరుక్కొనున్న సిగరెట్ లాక్కొని, రెండు దమ్ములు లాగి గదిమూలకు విసిరింది సుప్రియ. "నీవు గూఢచారివి అయివుండాలి. బైది బై... ఏదేశం తరఫున పనిచేస్తున్నావ్?"

"నేను గూఢచారిని కాదు. ఆ జాతికి చెందిన కొందరు వ్యక్తులు నా సహాయం అడిగారు. కాదనలేకపోయాను. వారికి సహాయపడుతున్నాను. మరి నీ సంగతి?"

"నేనొక దేశం తరఫున గూఢచారి కార్యకలాపాలు సాగించటానికి భారతదేశంలోకి ప్రవేశించాను. ఆదేశం... ఐమీన్... నా మాతృదేశం గురించి చెప్పను."

"తెల్సుకోవాల్సిన అవసరం నాకంతకంటే లేదు. నా కప్పగించబడిన పని కాస్త పెద్దదే. అది నిర్విఘ్నంగా

పూర్తి కావటానికి నీ సహాయం కొంత కావాలి."

"నిన్ను, నీ మాటల్ని ఎలా నమ్మటం?"

"ధాకా ధాకాకే ఊపర్ హోషిష్ రహానా."

"మనం దొంగలం కాదు" అందామె నవ్వుతూ.

"ఆమాటల కర్థం అది కాదు. ఏజాతి పక్షులు, ఆజాతి పక్షుల్ని నమ్మాలి."

"అచ్ఛా! నాద్వారా నీకు కావల్సిన సహాయం ఏమిటో చెప్పు."

కాసేపు మౌనంగా వుండిపోయాడు అభిమన్యు. "ప్రియా! నిన్ను నమ్ముతున్నాను..." ఒక్క క్షణం ఆగి తిరిగి ప్రారంభించాడు. "ఈనెల పదెనిమిదవ తారీఖున భారత ప్రభుత్వం 'వీరాభిమన్యు' అనే శాటిలైట్ ని అంతరిక్షంలోకి ప్రయోగించబోతుంది. దానికి ఏస్ట్రోనాట్స్ గా వినోద్, శర్మ, మైథిలి అనే వ్యక్తులు ఎన్నుకోబడ్డారు. వాళ్ళు ముగ్గురూ నాకు కావాలి."

"అంటే ఆ ముగ్గురినీ కిడ్నాప్ చేయాలంటావ్?"

"యస్!" సుప్రియ పెదవుల మీద చూపుడు వ్రేలితో రెండు సున్నాలు చుట్టాడు అభిమన్యు. "వంద తుపాకులు చెయ్యలేని పనిని ఒక్క ఆడది నిర్విఘ్నంగా పూర్తి చెయ్యగలదని నాకు తెల్సు. నీవు పూనుకుంటే వ్యోమగాములు నా ఆధీనం అవుతారు."

"డార్లింగ్! అపాయంలోకి నన్ను పంపాలని చూస్తున్నావ్. నేను ఆడదాన్ని. వెళితే తిరిగి రాలేనని నీకు నిజంగా తెలియదా?"

"డోంట్ ఆక్ట్ సిల్లీ. ఈవిషయాన్ని సీరియస్ గా తీసుకొని ఆలోచించు."

"ఓ. కె." బుగ్గలు సొట్టలుపడేలా నవ్వింది సుప్రియ. "ఏస్ట్రోనాట్స్ నీ ఆధీనం అవుతారు. ప్రతిఫలంగా నీవు నాకొక సహాయం చేయాలి."

"సహాయమా?"

"దాన్ని నీవు ఏ విధంగా అనుకున్నా పర్వాలేదు. వీరాభిమన్యుకి ఎన్నుకోబడిన వ్యోమగాములు నీకొక్కొవాలి. నాకేం కావాలో తెలుసా? నీ శక్తియుక్తులు... శాటిలైట్ వీరాభిమన్యు, ప్రయోగింపబడక మునుపే ధ్వంసమై పోవాలి."

అర్థం కానట్టు చూసాడు అభిమన్యు.

"అర్థంకాలేదా?" అభిమన్యు పాదాలమీద ముద్దుపెట్టుకుంది సుప్రియ. "ఈ నెల పద్దెనిమిదవ తారీఖున ప్రయోగింపబడనున్న ఉపగ్రహం వీరాభిమన్యుని నీవు నాశనం చెయ్యాలి. అందుకు నీవే సమర్థుడివని నాకు అన్పిస్తోంది."

చిన్నగా నవ్వాడు అభిమన్యు. "అంత సులభం కాదు. రాకెట్ కేంద్రంలోకి ఎవరు ప్రవేశించాలన్నా అనుమతి అవసరంవుంటుంది. కొత్త వాళ్ళకు రాకెట్ సెంటర్‌లోకి ప్రవేశార్హతవుండదు, శాటిలైట్ వీరాభిమన్యు సంరక్షణ భారం నిమిత్తం ఎంతో సెక్యూరిటీ ఏర్పాటు చేయబడి వుంటుంది. అందరి కళ్ళూ గప్పి రాకెట్ కేంద్రంలోకి ప్రవేశించడం కష్టం. ప్రవేశించినా శాటిలైట్ నాశనం చేయడం మరింత దుర్లభం.

ఎలాగో ఆ పనీ పూర్తి చేసినా; ఆతర్వాత ప్రాణాలతో బయటపడటం సాధ్యంకాదు."

"ఈ అణుయుగంలో మనిషికి అసాధ్యమైనది ఏదీ లేదు..." కొన్ని క్షణాలు మౌనం వహించిందామె.

"డార్లింగ్ ఏస్ట్రోనాట్స్‌తోబాటు పాతిక కిలోల బంగారంకూడా నీ కివ్వడానికి సిద్ధంగా వున్నాను, బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రా!"

"టూ హెల్ విత్ యు అసలు రాకెట్ కేంద్రంలోకి ప్రవేశించటం ఎలా?"

"సింపుల్" అభిమన్యు దగ్గరగా జరిగింది సుప్రియ. "దొంగచాటున కాకుండా అధికార హోదాలో నీవు రాకెట్ కేంద్రంలోకి ప్రవేశిస్తావ్. నీవు జేబుదొంగవు కాదు. సి.బి.ఐ. ఏజంట్‌వి. ఆ విధంగా నిన్ను నిరూపించి చూపించగల ఐడెంటిటీ కార్డ్ నీ కివ్వబడుతుంది. సి.బి.ఐ. ఏజంట్స్‌ని ఎవ్వరూ అడ్డగించరు."

"అర్థమైంది. మొదట వ్యోమగాముల విషయం తేలి పోవాలి!"

"ఆ విషయంగా నీవు చింతించాల్సిన అవసరం లేదు. వినోద్, శర్మ, మైథిలి ప్రస్తుతం నా ఆధీనంలోనే వున్నారు."

ఆశ్చర్యపోయాడు అభిమన్యు.

# 8

అంబాసిడర్ కాబ్ బాక్ సీట్లో సుప్రియ, అభిమన్యు వున్నారు. వేగంగా దూసుకెళ్తోంది టాక్సీ. డ్రైవర్ దృష్టి సంతా డ్రైవింగ్ మీద కేంద్రీకరించి వున్నాడు.

రాత్రి పదిగంటలు దాటి పదకొండు నిమిషాలైంది.

అభిమన్యు గుండెల్లో అరేబియన్ గుర్రాలు గాలప్ తీస్తున్నాయ్. మస్తిష్కంలో సముద్ర కెరటాల్లా ఆలోచనలు ఎగిరెగిరి పడుతున్నాయ్.

సుప్రియ ముఖం గంభీరంగా వుంది. నిశ్చింతగా సీట్లో

రిలాక్స్ అయివున్నదామె.

టాక్సీ బ్రిటీష్ ఎంబసి ప్రాంతాలకు వచ్చింది.

"ప్రియా!" పిలిచాడు అభిమన్యు.

"ఊఁ!" అందామె అప్రయత్నంగా.

"గమ్యం యింకా ఎంత దూరం వుంది?"

"తినబోతూ రుచి అడగటం అవివేకం."

సుప్రియ తెలివైన ఆడదని అతనికి అర్థమైంది. తెలివైన ఆడదాన్ని మాటల్లో జయించాలని ప్రయత్నించే మగవానికి సహజంగా ఓటమి ఎదురవుతుంటుంది.

ఆతర్వాత మాట్లాడలేదు అభిమన్యు. సిగరెట్ కాల్చాలని అన్పించినా బలవంతంగా ఆ కోరికనుఅణచుకున్నాడు ఈగల్లా ముసురుతున్న ఆలోచనల్ని దూరంగా తరిమేసే ప్రయత్నం చెయ్యకుండా మౌనంగా వుండిపోయాడు.

సుప్రియ ఏదేశ గూఢచారిణి అయ్యుంటుంది? అర్థం కావటంలేదు అభిమన్యుకి.

టాక్సీని ఓచోట ఆపించింది సుప్రియ.

అభిమన్యు, సుప్రియ టాక్సీనుండి దిగారు. టాక్సీ ఫేర్ సుప్రియ చెల్లించింది.

టాక్సీ అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

సమీపంలో పేవ్ మెంట్ మీదున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ వైపు అడుగులేసింది సుప్రియ, అభిమన్యు చేయి పట్టుకొని.

అర నిమిషంలో ఇద్దరూ బూత్ ని సమీపించారు.

"ఎక్స్ క్యూజ్ మీ, డార్లింగ్" బూత్ లోకి వెళ్ళి తలుపు వేసుకుంది సుప్రియ.

ట్రాఫిక్ ని చూస్తూ నిలబడ్డాడు అభిమన్యు.

పధ్దెనిమిది నిమిషాల తర్వాత బూత్‌లోంచి బయట కొచ్చింది సుప్రియ. "రెండు ప్రదేశాలకు ఫోన్ చేశాను. అందుకే ఇంత ఆలస్యం అయ్యింది" అంది అభిమన్యు చేయి అందుకుంటూ.

"ఐ.సీ! మనకోసం వాహనం వస్తుందా?"

"సరిగ్గా వూహించావ్."

ఎనిమిది నిమిషాలు భారంగా దొర్లిపోయాయ్.

సర్రున దూసుకొచ్చిన డిసోటా వీరికి కాస్త దూరంలో ఆగింది పెద్ద కుదుపుతో.

అభిమన్యు చేయి అందుకొని, డిసోటా వైపు అడుగు లేసింది సుప్రియ.

డిసోటా బాక్ సీట్లో ఇద్దరు ముస్లిమ్ యువకులు వున్నారు. జిన్నా టోపీలు ధరించారు. సిల్కు లాల్చీ, గళ్ళలుంగీ ధరించాడు ఒకతను. మెడలో తాయెత్తు వ్రేలాడుతోంది. రెండో వ్యక్తి స్కిన్ టైట్ స్వెట్టర్, పాంటు వేసుకొన్నాడు. అందంగా కత్తిరించుకున్నాడు గెడ్డం.

స్టీరింగ్ ముందు ఓ యువతి వుంది.

"నీవు బాక్ సీట్లో కూర్చో" చెప్పింది సుప్రియ.

కిక్కురుమనకుండా డిసోటా బాక్ సీట్లో మధ్యన కూర్చున్నాడు అభిమన్యు. అతని కిరువైపులా ముస్లిం యువకులు!

డ్రైవర్ ప్రక్కన కూర్చుంది సుప్రియ.

డిసోటా కదిలింది.

అభిమన్యు కళ్ళకు గంతలు కట్టబడ్డాయ్.

"సుప్రియా! వాటీజ్ దిస్?" అరిచాడు అభిమన్యు.

"సీక్రెట్ ఈజీ డార్లింగ్. మా రహస్య స్థావరం గురించి నీకు తెలియటం మాకు ఇష్టంలేదు. దిసీజ్ జస్ట్ ప్రికాషన్ ఓన్లీ. మరొక సంగతి కూడా చెప్తున్నా విను. నా పేరు సుప్రియ కాదు - ఎరీకా."

బదులు చెప్పలేదు అభిమన్యు.

అరగంటపాటు తిరిగిన వీధుల్లోనే తిరిగింది డిసోటా. చివరికి భూమి గుండ్రంగా వుందని నిరూపిస్తూ చాణక్య పురిలోకి ప్రవేశించింది.

ప్రయాణం ఎటువైపు సాగుతున్నదో అభిమన్యుకి అర్థం కావటం లేదు.

# 9

అభిమన్యు కళ్ళకు కట్టబడిన గంతలు విప్పెయ్యబడ్డాయ్.

"ఠంగ్... ఠంగ్..." మంటూ వరుసగా పదకొండు గంటలుకొట్టి మౌనం వహించింది గోడ గడియారం.

కళ్ళు నులుముకొని చుట్టూ కలయజూశాడు అభిమన్యు. తను విశాలమైన ఓ హాల్ మధ్య నిలబడివున్నట్టు తెల్సుకున్నాడు. అతని కెదురుగా ఐదు కుర్చీలు వున్నాయ్. వాటిల్లో ధనుంజయ్, విమల్, వినోద్, శర్మ, మైథిలి బంధింపబడి వున్నారు.

బంధితులకు ఒకప్రక్క ముస్లిం యువకులు ఇద్దరు, రెండోవైపు ఇద్దరు అందమైన యువతులు షాట్ గన్స్ ధరించి నిలబడున్నారు.

ఒకప్రక్కగా ఖరీదైన సోఫా సెట్టు వుంది. నాలుగు పదులు నిండిన వ్యక్తి ఓ సోఫాలో కూర్చుని సిగార్ కాల్చుకుంటున్నాడు. అతను పాకిస్తాన్ గూఢచారి

ఖాసింఖాన్ అని అభిమన్యుకి తెలియదేమో.

అభిమన్యు ప్రక్కనే నిలబడున్న సుప్రియ వురఫ్ ఎరీకా చిన్నగా దగ్గింది. "నీవు కోరిన వ్యోమగాములు వాళ్ళేనని ఇప్పటికైనా అంగీకరిస్తారా?" అడిగింది నవ్వుతూ.

తల అడ్డంగా వూపాడు అభిమన్యు. "వీళ్ళు నకిలీ వ్యక్తులు అయివుండాలి. అసలు వ్యక్తులు అయివుండరు వీళ్ళు."

"మిస్టర్ అభిమన్యూ!" పిలిచాడు ఖాసింఖాన్.

అభిమన్యుని తీసుకొని ఖాన్ దగ్గరకు వచ్చింది ఎరీకా. "మీట్ మిస్టర్ ఖాసింఖాన్... నా తండ్రి... బాబా! ఇతనే అభిమన్యు. డేరింగ్ ఎక్స్‌ప్లోజివ్" పరిచయం గొడవ ముగించిందామె.

ఖాసింఖాన్‌తో చేయి కలిపాడు అభిమన్యు.

ఖాన్ తిరిగి తన సోఫాలో రిలాక్స్ అయ్యాడు. అతని కదురుగానున్న సోఫాలో అభిమన్యు, ఎరీకా కూర్చున్నారు.

ఖాన్ పెదవులు కదిలాయ్. "మిస్టర్ అభిమన్యూ! మేము పాకిస్తాన్ ఏజంట్స్ అని నీకిప్పటికే అర్థమై వుంటుందని అనుకుంటున్నాను."

"అఫ్‌కోర్స్ - నకిలీ ఏస్ట్రోనాట్స్‌ని మీ రెందుకు బంధించారో ఇప్పటికీ నాకర్థం కావటంలేదు."

చిన్నగా నవ్వాడు ఖాసింఖాన్. "నీవు పొరబడుతున్నావ్. నకిలీ ఏస్ట్రోనాట్స్ గ్రౌండ్ కంట్రోల్ డైరెక్టర్ ధనుంజయ్ అభ్యంకర్ నివాసంలో హాయిగా వున్నారు. వీళ్ళు అసలు వ్యక్తులే."

బంధితుల ముఖాల్లో రంగులు మారుతున్నాయ్.

"బాబా అబద్ధం చెప్పటంలేదు, డార్లింగ్" తన తండ్రి మాటలకు వంతపాడింది ఎరీశా.

"ఇట్సాల్ రైట్. మీ అధీనంలో నకిలీ వ్యక్తులు లేరనే అనుకుందాం. నేను చేయవల్సిందేమిటో చెప్పండి?" అడిగాడు అభిమన్యు.

ఆరిపోయిన సిగార్‌ని టీపాయ్‌మీదున్న ఏష్ట్రేలో కుక్కాడు ఖాసింఖాన్. "నీ గురించి ఎరీశా చాలా చాలా చెప్పివున్నది. మైడియర్ అభిమన్యూ! నీవు ఎవరి తరఫున పనిచేస్తున్నా నాకనవసరం. నీకు ఏస్ట్రోనాట్స్ కావాలి. నిరభ్యతరంగా తీసుకెళ్ళు. కాని..." ఆగాడు.

"కాని?" అడిగాడు అభిమన్యు.

"అహమ్మదాబాద్ అంతరిక్ష కేంద్రంలోనున్న శాటిలైట్ 'వీరాభిమన్యు'ని నీవు ధ్వంసం చేయాలి."

"అది మాటలతో అయ్యే పనికాదని మీ అమ్మాయికి ఇదివరకే చెప్పివున్నాను."

నవ్వాడు ఖాసింఖాన్. "అహమ్మదాబాద్ అంతరిక్ష కేంద్రం గ్రౌండ్ సెక్యూరిటీ ఫోర్స్ కాప్టన్ హితేశ్వర్‌ని నేను అంతం చేశాను. అతని వేషంలో చాలా రోజులుగా తిరుగుతున్నాను. 'వీరాభిమన్యు'కి ఎన్నుకోబడిన ఏస్ట్రోనాట్స్‌ని కిడ్నాప్ చేసి, వారి స్థానంలో నకిలీ వ్యక్తుల్ని వుంచాను. గ్రౌండ్ కంట్రోల్ డైరెక్టర్‌ని, ఆయన కొడుకును ఇక్కడ బంధించాను. ఈ పనులన్నీ కూడా మాటలతో అయివుండవు. దేనికైనా తెగింపు కావాలి.

నీకు అవసరమయ్యే అన్ని అనుకూలాలు, సహాయాలు నేను చేస్తాను. నీవు చేయవల్సింది ఒక్కటే. ముందు

వెనుకలు ఆలోచించకుండా బుల్లెట్‌లాగా దూసుకెళ్ళి టార్గెట్‌ని తాకాలి. శాటిలైట్ 'వీరాభిమన్యు' పద్దెనిమిదవ తారీఖు లోపలే ధ్వంసం కావాలి. దట్సాల్!"

"సెక్యూరిటీ కాప్టన్ హితేశ్వర్ హోదాలో మీరే వెళ్ళి శాటిలైట్‌ని ధ్వంసం చేయవచ్చు కదా! అవకాశం వున్నా మీ రెందుకు దాన్ని వుపయోగించుకోవటం లేదు?" అడిగాడు అభిమన్యు.

"సరైన ప్రశ్నే వేశావ్" ఖాసింఖాన్ పెదవులు కదిలాయ్. "నేను హితేశ్వర్ కాదని భారత ప్రభుత్వానికి తెలియటం నా కిష్టంలేదు. మూడు మాసాలక్రితం శాటిలైట్ భాగ్యరేఖ ధ్వంసమైపోవటానికి కారకుణ్ణి నేనే అని భారతీయులు ఎప్పటికీ తెల్సుకోలేరు. హితేశ్వర్‌గా నేను యింకా కొంతకాలం చలామణి కావాలనుకుంటున్నాను. అంతేకాదు. అంతరిక్షంలోకి ప్రయోగించటానికి సిద్ధం చేసిన శాటిలైట్‌ని ధ్వంసంచేసి, అక్కణ్ణుంచి తప్పించుకొని రావటం కాస్త కష్టమే. అందుకు నీవే సమర్ధుడివి. డియర్ అభిమన్యూ, బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రా!

ఎవరి క్రిందనో నీవు పనిచెయ్యడం నా కిష్టంలేదు. ఈ ఆపరేషన్ పూర్తయితే ఎరీకా నీ అర్ధాంగి అవుతుంది. మీ రిద్దరూ పాకిస్తాన్ వెళ్ళిపోవచ్చు. అక్కడ మీకు పాక్ ప్రభుత్వం అన్ని సదుపాయాలూ చేస్తుంది. ఉజ్వలమైన భవిష్యత్తు వుంది నీకు. దాన్ని పాడుచేసుకోవద్దు. నీ వంటి వ్యక్తి జీవించాల్సింది జేబు దొంగతనాలు చేస్తూ కాదు.

మన పరిచయం బంధుత్వంగా మారాలని ఆశిస్తున్నాను. నీ అభిప్రాయం ఏమిటో చెప్పు."

కాసేపు అరచేత్తో నుదురు రుద్దుకున్నాడు అభిమన్యు.

"పదినిమిషాలు వ్యవధి కావాలి!" అన్నాడు తలెత్తి ఖాసింఖాన్‌ని చూస్తూ.

"ఓ.కె!" అన్నాడు పాకిస్తాన్ గూఢచారి ఖాసింఖాన్.

బంధితుల గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయ్. అందరి చూపులూ అభిమన్యు పైనే వున్నాయ్.

నిముషాలు గడుస్తున్నాయ్.

"పది నిమిషాలు పూర్తయ్యాయ్!" అభిమన్యు భుజం మీద చేయి వేసింది ఎరీకా. "బాబాని నిరుత్సాహపరిచే సమాధానం నీ నోటినుంచి బయటపడదని ఆశిస్తున్నాను."

మందహాసం చేశాడు అభిమన్యు - తన సమాధానం అదేనన్నట్టు.

"ధన్..." మంటూ చప్పుడైంది గుమ్మంలో. బుల్లెట్ పైకప్పుని తాకింది. బిలబిలమంటూ ఆ హాల్లోకి ప్రవేశించారు పోలీసులు.

ఆశ్చర్యపోయాడు ఖాసింఖాన్.

"ఆల్ ఆఫ్ యు హేండ్సప్" అరుస్తున్నారు ఢిల్లీ కమీషనర్ ఆఫ్ పోలీస్. "ఏ ఒక్కరు కదిలినా అందరినీ కాల్చి చంపడానికి వెనుకాడము."

పాట్ గన్స్ ధరించిన ముస్లిం యువకులు ఫైరింగ్ ప్రారంభించబోయారు.

"ధన్...ధన్...ధన్...ధన్..."

ముస్లిం యువకులు భీకరంగా అరిచారు పాట్‌గన్స్ జారవిడుస్తూ. మిగిలిన ఇద్దరు యువతుల చేతులనుండి గన్స్ జారిపోయాయ్.

ఖాసింఖాన్ మెరుపు వేగంతో లేచి నిలబడుతూ జేబులోంచి రివాల్వర్ తీయబోయాడు. అప్పటికే ఆలస్యమైంది.

చిఱుతపులుల్లా ఇద్దరు ఇన్ స్పెక్టర్లు ముందుకు దూకి, అతన్ని లొంగదీసుకొని, ఆయుధం స్వాధీనపర్చుకున్నారు.

అభిమన్యుకి తప్ప మిగిలినవాళ్ళ చేతులకు బేడీలు పడ్డాయ్.

బంధితులకు స్వేచ్ఛ లభించింది.

కమీషనర్ ఆఫ్ పోలీస్ ముఖంలోకి కోపంగా చూస్తూ కసికసిగా పళ్ళు కొరికింది ఎరీకా. "అతని పేరు అభిమన్యు. మా మనిషే. అతన్ని మీరు వదిలేశారు."

కమీషనర్ నవ్వాడు. "ఆయన మీ మనిషి కాదు. సి.బి.ఐ. ఏజంట్. పేరు అదే... అభిమన్యు."

హేళనగా నవ్వింది ఎరీకా. "అతను చూపించిన ఐడెంటిటీ రికార్డ్ డూప్లికేట్ ది. ఆ రికార్డ్ అతనికి నేనే ఇచ్చాను..." అరిచింది పిచ్చిగా.

విమల్ చిన్నగా దగ్గాడు. "పొరబడుతున్నావ్, మేడమ్! వాడు జేబుదొంగ కాదు— సి.బి.ఐ. ఏజంట్. నీమీద ఏదో అనుమానం వచ్చిందట. తనకు నిన్ను పరిచయం చేయమన్నాడు. ఎందుకైనదీ... ఆ వివరాలేవీ నాకు అప్పట్లో తెలియవు."

ఎరీకా చూపులు అభిమన్యుమీదకు తిరిగాయ్, "అయితే నీవు సి.బి.ఐ. ఏజంట్ అన్నమాట. నీ పేరు అభిమన్యు కాదన్నమాట. నాతో స్నేహం సంపాదించటానికి ఆ పేరు..."

"నో... యువార్ రాంగ్, ప్రియా అలియాస్ ఎరీకా! నా పేరు అదే" చెప్పాడు సి.బి.ఐ. ఏజంట్ అభిమన్యు. రెండు క్షణాలాగి తిరిగి తనే అన్నాడు.

"మిస్ ఎరీకా! 'భాగ్యరేఖ'ని ధ్వంసం చేసినట్టు 'వీరాభిమన్యు'ని ధ్వంసం చెయ్యటానికి మీకు అవకాశం

లేకపోయింది. అందుకే 'వీరాభిమన్యు'కి ఎన్నుకో బడిన ఏస్ట్రోనాట్స్‌ని దాచేసి, వారి స్థానంలోకి నకిలీ వాళ్ళను ప్రవేశపెట్టి శాటిలైట్ ప్రయోగాన్ని తాత్కాలికంగా ఆపుచేయించాలని ప్రయత్నించారు. ఏస్ట్రోనాట్స్ ఎదురు తిరిగితే శాటిలైట్ ప్రయోగం జరుగదు. ఈ నెల పధ్ధెనిమిదవ తారీఖున మునుపే నిర్ణయింపబడిన ప్రకారం శాటిలైట్ 'వీరాభిమన్యు' ప్రయోగం జరుగకుండా ఆగి పోతే ఆ తర్వాత వీలుచూసుకొని దాన్ని స్మాష్ చెయ్యొచ్చని తలంచారు.

కానీ, కథ అడ్డం తిరిగింది.

ఏస్ట్రోనాట్స్ వినోద్, శర్మ, మైథిలి రూపాల్లో మీరు వుంచిన వ్యక్తులు నకిలీ అని మాకు ఎప్పుడో తెలుసు. అయినా వూరుకున్నాం. ఎప్పుడైనా వారినుంచి మాకు కావల్సిన సమాచారం బయటకు వస్తుందేమోననే ఆశతో, అసలు వ్యక్తుల్ని ఎవరు మాయం చేశారో, ఎక్కడ దాచారో తెల్సుకోవాలనే పట్టుదలతో నకిలీ వ్యక్తుల్ని ఫ్రీగా వుంచాము.

నీమీద మాకు అనుమానం కలిగివుండేది కాదు. నీ అనుచరులైన నకిలీ ఏస్ట్రోనాట్స్‌ని ఫ్రీగా వుంచినా వారి మీద స్పై వుంచబడింది. ఆ సంగతి వారికి తెలియదు. వాళ్ళు తరచుగా నిన్ను కల్సుకొనే వాళ్ళు.

సమాజం దృష్టిలో మామూలు ప్రాస్టిట్యూట్‌వి నీవు. అటువంటి నిన్ను నకిలీ ఏస్ట్రోనాట్స్ పదేపదే ఎందుకు కల్సుకున్నారు? అక్కడే కల్గింది నాకనుమానం. మరొక సంగతి. నిన్ను నమ్మించటానికి ఓ జేబు కొట్టాను. అత నెవరో తెలుసా? నాతోటి ఏజంట్."

బదులు చెప్పకుండా తల దించుకుంది ఎరీకా.

చిన్నగా దగ్గాడు ఖాసింఖాన్. "జరిగినదానికి నేను చింతించటం లేదు. గూఢచారులకు జయాపజయాలు కలగటం సహజం. పోలీసులు ఈ ప్రదేశాన్ని ఎలా కనుక్కోగలిగారు? మిస్టర్ అభిమన్యూ! ఇప్పటికీ నాకర్థం కావటం లేదీ సమస్య. నిన్ను డిసోటాలో తీసుకొచ్చారు మావాళ్ళు. డిసోటా వెనుక ఎటువంటి వాహనమూ రాలేదని నమ్మకంగా చెప్పింది ఎరీకా. అయినా ఈ ప్రదేశానికి పోలీసులు ఎలా రాగలిగారో అర్థం కావటంలేదు."

అభిమన్యు పెదవులు కదిలాయ్. "మిస్టర్ ఖాన్! భారతీయుల్ని ప్రతిసారీ తక్కువగా అంచనా వేసుకొని భంగపడటం మీకు అలవాటైపోయింది. ఇహ నీ ప్రశ్నకు సమాధానం విను. ఎరీకా ఎపార్ట్‌మెంట్ నుంచి బయలుదేరాం. దారిలో టాక్సీ ఎక్కి, ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ వద్ద దిగేశాము. కారు పంపమని ఫోన్ చేసింది ఎరీకా.

డిసోటా మరికొద్ది సేపట్లో వచ్చి ఆగింది. నేను డిసోటాలోకి చేరుకునే సమయంలో నా దగ్గరున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్‌ని ఆన్ చేశాను. అది కారు ప్రయాణం చేసిన రూట్‌ని పోలీస్ కంట్రోల్ రూమ్‌లో స్పష్టంగా తెలియజేస్తుంది. నా సిగ్నల్ కోసమే ఎదురు చూస్తున్న పోలీస్ కమీషనర్ గారు సులభంగా మీ స్థావరాన్ని ముట్టడించడం జరిగింది."

అర్థమైందన్నట్లు తల పంకించాడు ఖాసింఖాన్.

విమల్ చేయి అందుకొని, పోలీసుల కంటే ముందే ఆ హాల్లోంచి బయటకు వచ్చాడు సి. బి. ఐ. ఏజంట్ అభిమన్యు.

—: ఐపోయింది :—




[మూడవ భాగము]

పిడుగుల్లా వినబడ్డాయి కాప్టెన్ మాటలు.

శాన్యోరా, నేనూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాం.

"రెండు రోజులకు సరిపడే పాక్డ్ ఫుడ్స్ మాత్రం మీకు యివ్వబడుతాయ్. ఏదో క్షణంలో ఏ సముద్ర జంతువులో మిమ్మల్ని చప్పరించేస్తాయి. లేదా ఆహారం లేక చిక్కి శల్యమై యే ఒడ్డయినా చేరితే అక్కడి పోలీసులు మిమ్మల్ని బంధించి యిండియాకి పార్సెల్ చేస్తారు."

"మరో విషయం! మీవద్ద రివాల్వర్ లాంటి ఆయుధాలు ఏవీ వుండవ్.

కంపాస్ (దిక్సూచి) కూడా యివ్వం. నాలుగు తెడ్లు సీన్లు చూసుకోడానికి బైనాక్యులర్ మాత్రం యిస్తాం," అన్నాడు నవ్వుతూ.

"దిసీజ్ హారిబుల్ కాప్టెన్!" అరిచాను నిస్సహాయంగా.

"అదృష్టం వుంటే నలభై ఎనిమిది గంటలపైగా జీవించి హాయిగా సెలిబ్రేట్ చేసుకోండి. హాట్ డ్రింక్స్ మీకు కావల్సినంత యిస్తాను అయితే ఓ షరతు. చచ్చింతర్వాత మాత్రం జంట దెయ్యాలుగా మారి నన్ను ఏడిపించకండి" అన్నాడు గలగల నవ్వుతూ కాప్టెన్.

నా ముఖం పాలిపోయింది. ఏం చెయ్యాలి?

కనీసం మెషీన్ బోటయినా కాదు. చేతుల్తో లైఫ్ బోటుని ఎన్ని వందలమైళ్ళు నడిపి పోర్ట్ సూడాన్ చేరతాం? అయోమయంగా శాన్యోరా వైపు చూసాను. ఆమె ముఖం చెమట పట్టి కోపంగా కనిపిస్తోంది. ఎవడి పీకో అందుకొని కొరికెయ్యాలన్నంత క్రోధంగా ఉందామె.

"వెల్ మిస్టర్ భయంకర్! నువ్వు స్పృహతప్పి అర గంట మాత్రం అయింది. యిప్పుడు సాయంత్రం ఆరు గంటలవుతోంది. చీకటి పడకుండానే మిమ్మల్ని పంపించెయ్యాలనుకుంటున్నాం. ఈ రాత్రి మేము హాయిగా నిద్రపోవాలి. అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి. లైఫ్ బోటు మీకోసం ఎదురు చూస్తోంది. గెటవ్!" అన్నాడు గంభీరంగా కాప్టెన్, పిస్తోలు ఆడిస్తూ.

* * *

తెడ్లు వేగంగా కదుల్తున్నాయి......

లైఫ్ బోటుని ముందుకు పోనిస్తున్నాను.

ఎయిమ్ లెస్ సైలింగ్!

శాన్యోరా ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయింది.

చీకట్లు ముసురుకుంటున్నాయ్.

మమ్మల్ని వదిలివేసిన సీఫ్లవర్ ఓడ కనుచూపుమేరలో కనబడుతోంది.

ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డాను.

కాస్సేపు తెడ్లు వెయ్యడం ఆపి నీటి ఉపరితలంపై ముఖం పెట్టి చెవులు రిక్కించాను!

సముద్రంలో ఏదో గందరగోళం జరుగుతోంది.

మెదడులో ఏదో అనుమానం తట్టింది.

నిజమేనా అది? మైగాడ్ ...

"శా...న్యో...రా!" కేక పెట్టాను.

నా కేకకు అదిరిపడి ఈ లోకంలోకి వచ్చిందామె.

"ఏమిటి?" అంది కంగారుగా.

"సముద్ర భూకంపం!" అరిచాను. "క్విక్! లైఫ్ బోటుకు నీ కాళ్ళు, నా కాళ్ళు, సామగ్రి అన్నీ కలిపి కదలకుండా తాడుతో కట్టేయ్యి, ప్రశ్నలు వద్దు."

శాన్యోరా చటుక్కున ఓ తాడు అందుకుంది.

ఈదురు గాలీ, వర్షం ఏమీ లేవు.

కొండలు గుద్దుకొంటున్నట్లుగా, నీరు లోలోపలే గుద్దుకుంటోంది.

కెరటాల కగుపుకు లైఫ్ బోటు నాలుగు అడుగులు పైకి లేచింది.

బలంగా ఎత్తి కుదేసినట్లయింది.

ఓ చేత్తో లైఫ్ బోటు అంచును బలంగా పట్టుకుని బైనాక్యులర్స్‌తీసి స్లీఫవర్ షిప్ వైపు చూశాను.

అంతే! అదిరిపోయాను.

నా తల మీద పది యిటుకలు పడ్డట్లయింది.

రెండు నీటి ఉప్పెనలు వచ్చి అంత పెద్ద నౌకనీ నీటిలోకి తీసుకుపోయాయి. ఒక్క కొయ్యముక్క కూడా నీటి పైకి రాలేదు.

ఏమయింది...?

నీటిలో అర్థంకాని భయంకర శబ్దం వినబడింది.

అది ఏమిటి...??

శాన్యోరా తాళ్లు కట్టడం పూర్తయింది. యిప్పుడు నా కాళ్ళు కదలడంలేదు.

"శాన్యోరా! మనల్ని వదిలిన షిప్ సముద్రగర్భంలో కలిసిపోయింది."

"మేజర్! నాకేం అర్థం కావటంలేదు." అంది శాన్యోరా అయోమయంగా, బోటు అంచును గట్టిగా పట్టుకుంది.

లైఫ్‌బోటు ఎగిరి ఎగిరి పడుతోంది.

ఇప్పుడు దాన్ని నడపడం అసాధ్యం.

తెడ్లు ఎప్పుడో జాగ్రత్త చేశాను.

అ స్తవ్యస్తంగా, ఉధృతమైన కెరటాలు లైఫ్‌బోటుని అతి వేగంతో ఎక్కడికో తీసుకుపోతున్నాయి.

"శాన్యోరా! బోటు అంచున వున్న తాళ్ళు గట్టిగా పట్టుకో, సముద్రభూకంపం ఏర్పడింది. సముద్రగర్భంలో నేల రెండుగా చీలిపోయివుండాలి. అందులోకి ఆబరువైన స్లీఫవర్ షిప్ యిరుక్కుపోయివుండాలి. అందుకే ఒక

కొయ్యముక్క కూడా నీటిపైకి కొట్టుకురాలేదు."

"ఫాం...టా...స్టి...క్..." గొణిగింది శాన్యోరా.

"నథింగ్ ఫాంటాస్టిక్ శాన్యోరా! సముద్రభూకంపం మహావినాశకరమైంది. ముందుగా ఏ నావికుడికీ తెలియదు. మన లైఫ్ బోటు చిన్నది. తేలికయినది. ఏట్లో గడ్డిపోచలా కొట్టుకుపోతుంది. అందుకే నువ్వు గట్టిగా పట్టుకోవాలి."

నా మాటలు పూర్తి కాలేదు. కెరటాల వేగం పెరిగింది.

విమానవేగంతో కొట్టుకుపోతోంది మా లైఫ్ బోటు!

నా కళ్ళు తిరుగుతున్నాయి.

"శాన్యోరా! వదలకు పట్టు. బీ కేర్ ఫుల్!" అరిచాను మరోసారి.

కెరటాలు ముఖంమీద ఈడ్చి కొడుతున్నాయి.

ఒకో క్షణంలో ఒకవంక మునిగిపోతోంది లైఫ్ బోటు.

అయితే బోటు లోతులేకుండా ఫ్లాట్ గా ఉండటం వల్ల మళ్ళీ తేలుతోంది.

కళ్ళు మండుతున్నాయి ఉప్పునీళ్లుపడి.

వాటర్ ప్రూఫ్ పాకింగ్ లో ఉన్న సామగ్రిని అప్పుడప్పుడు కాలితో తడుముతూ ధైర్యం తెచ్చుకుంటున్నాను.

ఒక కెరటం వెళ్ళి మరో కెరటం వచ్చే ఖాళీ సమయంలో చటుక్కున ఎదురుగా ఉన్న శాన్యోరాని పట్టుకున్నాను.

"థాంక్యూ మేజర్" అంది భయంగా నన్ను వాటేసుకుంటూ.

మా కాళ్ళని తాళ్ళు పెనవేశాయి.

లైఫ్ బోటు అతివేగంగా జారుతోంది నీటిపై.

చుట్టూ అనంతసాగరం...

మిమ్మల్ని ఎక్కడికో తీసుకుపోతున్నాయి ఊహించని వేగంతో బలమైన కెరటాలు.

జానీ కళ్ళలో మెదిలాడు...

నా కళ్ళలో వెచ్చటి కన్నీళ్ళు ఉబికాయ్.

షిప్‌లోని జానీ సాగరగర్భంలో... సజీవ సమాధి అయిపోయి ఉంటాడు,

ఒక్క జానీయేకాదు... అంతా... నా కంటూ తోడు శాన్వ్యోరా మాత్రమే.

ప్రేమగా ఆమెను అతుక్కుపోయాను.

* * *

సూర్యకాంతి ముఖంపై వేడిగా తగిలి నిద్రలేచాను.

ఏమీ ఎరుగని నంగనాచిలా ఇప్పుడు సముద్రం ప్రశాంతంగా ఉంది.

శాన్వ్యోరాను తట్టి లేపాను.

ఆమె నీరసంగా కళ్ళు తెరిచింది.

గతం కలా? నిజమా? అనిపిస్తోంది.

మా లైఫ్‌బోటు సముద్రంమధ్య నీళ్ళపై తేలియాడుతోంది.

జరిగిన విషయం మెల్లగా జ్ఞాపకం వస్తోంది.

సముద్రపు పోటు కొంతసేపటికి తగ్గింది.

కెరటాలు ఒళ్ళు హూనం చెయ్యడంచేత చీకటిలో బోటుమీద అలాగే అలసి నిద్రపోయాం.

ఇద్దరం తడిసిపోయి ఉన్నాం.

ఇంకా ఆరలేదు దుస్తులు.

“శాన్వ్యోరా! ఆర్ యూ ఓ. కే?” అడిగేను ఆమె

కాలికున్న కట్లు విప్పుతూ.

కాన్యోరా బాబ్‌డ్ హెయిర్ వెనక్కి తోసుకుంటూ సర్దుకు కూర్చుంది.

"అయామ్ ఓ. కే. డియర్! కొంచెం తలనొప్పిగా ఉందంతే." కాన్యోరా కంఠంలో మార్పు కనబడింది, జలుబు చేసినట్లు.

ఆమె నుదుటిమీద చెయ్యివేశాను. వెచ్చగా తగిలింది చెయ్యికి.

"మైగాడ్! జ్వరం ఏ నూటనాలుగో ఉంటుంది. మన దగ్గర ఏ టాబ్లెట్లూ లేవు" అన్నాను ఆందోళనగా.

"ప్లీజ్ టేకిట్ ఈజీ డియర్" అని ఊరుకుని సముద్రం వేపు చూడసాగింది.

రెండు క్షణాలు మౌనంగా ఉండి అడిగేను.

"కాన్యోరా! వేడివేడి కాఫీ పెట్టనా?"

ఉలిక్కిపడి నావేపు చూసింది "నా ఒంటిమీద మరగబెడతావా నీళ్లు?" అంది చేత్తో నవ్వునాపుకుంటూ.

"నువ్వలాగే చూస్తూ ఉండు" అన్నాను సీరియస్‌గా.

గబగబా ఫుడ్ పాకెట్స్ వేపు నా చేతులు కదిలాయి.

నెస్ కాఫీ పౌడర్ డబ్బా బయటకి తీశాను.

మిల్క్ టిన్ తీసి, బూటుకాల్లోని కత్తితో ఓపెన్ చేసాను.

బిస్కట్ల డబ్బా ఖాళీచేసి కొన్ని కాన్యోరా చేతిలో పెట్టి, మిగతావి పాలిథిన్ కాయితంలో చుట్టేశాను.

ఖాళీ బిస్కట్ల డబ్బాలో కాఫీపౌడర్ పోసి, కండెన్స్‌డ్ పాలు అందులోకి వంపాను.

విస్కీబాటిల్ బయిటకితీసి కార్క్ లాగాను.

శాన్యోరా బిస్కట్ కొరుకుతూ నావేపు వింతగా చూస్తోంది.

నవ్వుతూ ఆమె పొత్తికడుపుమీద చేయి వేశాను.

కంగారుగా అదోలా అరుస్తూ పైకిలేచింది శాన్యోరా.

నా చెయ్యి బయిటికి లాగాను. అంతే!

ఆమె ధరించిన ఎర్రటి ఊలు స్వెటర్ క్రిందిభాగం నుండి నాలుగయిదు మూరల ఊలుదారం బైటికి వచ్చింది. మళ్ళీ ఆమె నడుంవద్ద ముఖంపెట్టి రెండో కొస దారం నోటితో తెంపాను.

శాన్యోరా నా తలమీద చిన్నగా మొట్టి మౌనంగా కూర్చుంది.

ఊలుదారాన్ని నాలుగయిదు మడతలుపెట్టి దళసరిగా అరచేతిలో పేనుతూ ఒత్తిగా చేశాను.

విస్కీబాటిల్లో తడిపి ఒత్తి బయిటికి ఉండేలా అమర్చాను.

లైఫ్‌బోటులో కాళ్ళు ఉంచుకునేచోట, వారగా ఆ సీసాను పెట్టాను.

గాలి తగిలే ప్రమాదంలేదు.

అగ్గిపెట్టెతో ఒత్తిని వెలిగించాను. ఓహ్!

లక్షవత్తుల వ్రతంలో దీపంలాగ అఖండంగా వెలుగుతోందది.

బోటు అంచులమీద తెడ్లు ఒకటికొకటి క్రాస్ అయ్యేలా × మార్కులా అమర్చాను.

రెండూ కలిసేచోట కాఫీ డబ్బా పెట్టాను.

విస్కీబుడ్డి కాల్‌గాస్ స్టవ్‌లా పనిచేస్తోంది.

డబ్బా పలుచని రేకుతో చెయ్యడంవల్ల త్వరత్వరగా వేడెక్కుతోంది.

రెండు నిముషాల్లో కాఫీ తయారయింది.

"మార్వలస్ డియర్!" ఎగిరి గంతేసినంత పనిచేసింది కాన్స్యోరా.

షుగర్ వెయ్యనక్కరలేదు.

పాలలోనే ఉంటుంది.

కప్పులు లేవు.

కొంచెం చల్లబడ్డాక డబ్బాని కాన్స్యోరా కిచ్చాను.

"నీకూ?" అంది నోరు సున్నలా పెట్టి.

"ఫిఫ్టీ-ఫిఫ్టీ! ముందు నువ్వు తాగు. మిగతాది నీ అధరామృతం కలిసి మరింత తియ్యగా ఉంటుంది నాకు."

"య్యూ న్యాటీ" కొరకొరా చూసింది కాన్స్యోరా.

ఆమె ఒళ్ళోవి రెండు బిస్కట్లు తీసి నవిలేశాను.

"స్టౌ" ఆర్పేసి విస్కీ బాటిల్ భద్రం చేసాను.

"మేజర్ డియర్! అద్భుతంగా ఉంది కాఫీ" కామెంట్ చేసింది సిప్ చేస్తూ.

"అలాగని అంతా తాగెయ్యక."

"అవసరాల్లో నీ బుర్ర హీటర్‌లా పనిచేస్తుందని నాకు తెలియదు. లేకపోతే నీ బుర్రమీదే కాఫీ కాచేదాన్ని" అంది కాఫీ టిన్ తిరిగి యిచ్చేస్తూ.

అంచు పట్టుకొని డబ్బాలోకి చూసాను. "ఫిఫ్టీ ఫిఫ్టీ అన్నాను. తర్టీ పర్సెంటే తాగావు?" అడిగాను.

"పాపం కష్టపడి తయారుచేసావ్. డ్రింకిట్ డియర్" అంది సామగ్రిలో చేతులు పెట్టి సిగరెట్ పాక్ అందుకుంటూ.

హాట్ కాఫీ తాగి సిగరెట్ ముట్టించిన తర్వాత జవసత్వాలు తిరిగి చకచకా పనిచేస్తున్నట్లనిపించింది.

శాన్యోరా ఉత్సాహం ఆమె మాటల్లో కనబడుతోంది.

"శాన్యోరా! నువ్వు బట్టలు మార్చుకోవడం మంచిది. లేకపోతే జ్వరం తీవ్రం అయ్యే ప్రమాదం ఉంది" అన్నాను సిగరెట్ పీలుస్తూ.

"వ్వాట్... నీ ఎదురుగా... యిలాగా..."

"డోంట్ బీ సిల్లీ. కనుచూపు మేరలో ఎక్కడా తీరం కనబడటంలేదు. మనకు ఆరోగ్యం పాడవుతే ఇక్కడ మెడిసిన్స్ ఇచ్చేవాళ్ళు ఎవరూ లేరు."

"అయితే మాత్రం... ఛీ... పాడు..."

"ఆల్ రైట్. నేనే నీ బట్టలు విప్పి కొత్తవి కడతాను" అంటూ నవ్వుతూ లేచాను.

"యూ నాటీ రాడీ!" వెనక్కి తోసింది నన్ను. "ఆల్ రైట్. అటువైపు తిరిగి కూచో."

"ఎటు తిరిగినా నువ్వే కనిపిస్తావ్" అంటూ ఆమె చెప్పినట్లు చేసాను.

"ఇప్పుడు తిరుగు" అంది రెండు నిముషాల తర్వాత.

వెనక్కి తిరిగి చూసాను. ఎర్రపువ్వుల గౌనులో మెరిసి పోతోంది శాన్యోరా.

కూర్చున్నపుడు మోకాళ్ళపైగా పచ్చటి తొడలు మెరుస్తున్నాయి.

"ఎంత అందంగా ఉన్నావో తెల్సా?"

"మీదకిరాక" అంది నవ్వుతూ చేతులు తిన్నగా చాచి.

ఆ చేతులు పట్టుకొని బలంగా నా మీదకు లాక్కున్నాను.

మా పెదిమలు అతుక్కుపోయాయి.

ఉన్నట్టుండి దూరంగా ఏవో కేకలు వినబడ్డాయి, లీలగా.

ఉలిక్కిపడి ఇద్దరం రైలుపెట్టెల్లా విడిపోయాం.

చటుక్కున బైనాక్యులర్స్ తీసాను.

నా కళ్ళు నలువైపులా పరికించాయి.

ఫర్లాంగుదూరంలో ఎత్తయిన ఓ నాటుపడవ కనబడింది.

భారీవృక్షాన్ని దొలిచి తయారుచేసిన పడవ అది.

దానిమీద కొందరు ఆటవికులు, క్లోజప్‌లో కనబడసాగారు.

ఏవేవో పిచ్చికేకలు వేస్తున్నారు.

వాళ్ళచేతుల్లో పొడవాటి ఈటెలు ఉన్నాయ్.

ఆ విషయం శాన్యోరాకి చెప్పాను.

ఎందుటాకులా వణకసాగిందామె.

* * *

"శన్యోరా! ఆ పడవ వైపు నడుపుదామా?" అడిగాను శాన్యోరాని.

"భయంకర్! ఆటవికులు ఇటువైపు వస్తున్నారంటే దగ్గర్లో ఏదో దీవి ఉండి ఉండాలి. మనం తప్పించుకుని పారిపోగల్గినా-బ్రతకడం కష్టం. కారణం మన దగ్గర రేషన్స్ రేపటిదాకా మాత్రం సరిపోతాయి. ఎంత పొదుపుగా మనం వాడినా మేక్సిమమ్ మూడు రోజులు మాత్రం రావచ్చు. ఏమయితే అదవుతుంది. సో... బెటర్ వుయ్ మూవ్ దట్ వే." అంది ధైర్యం తెచ్చుకుంటూ శాన్యోరా.

యిద్దరూ తెడ్లు వేగంగా తిప్పసాగాం.

లైఫ్ బోటు వేగంగా కదులుతోంది.

పది నిముషాల్లో ఆటవికుల పెద్ద పడవకి ఎదురుగా వచ్చాం.

అందరూ మమ్మల్ని చూసి ఏదో భాషలో గొణు క్కుంటున్నారు, గుంపులుగా నిలబడి. వాళ్ళకేసి పరిశీలనగా చూసేను.

అందరివీ నల్లని శరీరాలు.

మెళ్ళోను, మోచేతుల పైగా రంగు రంగుల పూసల దండలున్నాయి.

మొలల దగ్గర తప్ప శరీరానికి ఆచ్ఛాదన ఏమీ లేదు.

తైల సంస్కారం లేని కేశాలు భుజాలదాకా వ్రేలాడు తున్నాయి.

ఏవో పక్షి ఈకలతో, నేర్పుగా అల్లబడిన దుస్తులు మొలల వద్ద ధరించారు.

అందరూ ఓ వృద్ధుడి ప్రక్కగా చేరి ఆటవిక భాషలో మా గురించి ఏదో చెప్తున్నట్లు గ్రహించేను. అతడే నాయ కుడై ఉండాలి.

నా రంగుల చొక్కా విప్పి బోటులో లేచి నిలబడి, నవ్వుతూ స్నేహాపూర్వకంగా గాలలో ఆడించాను.

"అవ్... కమ్..." అంటూ అరిచాడు నాయకుడు.

దిగ్భ్రమతో శాన్యోరా, నేను ఒకరినొకరు చూసు కున్నాం.

"శాన్యోరా నాయకుడికి యింగ్లీష్..." ...అంటూ ఆగిపోయాను ఆశ్చర్యంతో.

"బ్రోకెన్ యింగ్లీష్" అంది సంతోషంగా శాన్యోరా.

ఆటవికులు ఓ మోకుతాడు మా బోటువైపు విసిరారు.

ఆ తాడు పట్టుకొని లైఫ్ బోటును ఆ పెద్ద పడవవైపు కదిలించాను.

"శాన్యోరా! ముందు నువ్వెక్కు. తర్వాత నేను తాడుని

లైఫ్ బోటుకి కట్టి పైకొస్తాను. ఓ.కే?"

ఆమె తల ఊపి తాడు పట్టుకుని చకచకా పైకి ఎక్కింది. ఆటవికులు ఆమెకు చెయ్యి అందించి లోపలికి లాక్కున్నారు.

లైఫ్ బోటుని వాళ్లందించిన మోకుతాడుతో బలంగా కట్టాను.

సామగ్రి వీపుకు కట్టుకొని పైకి ఎగబ్రాకాను.

ఎత్తయిన ఆ నాటు పడవను పరీక్షగా గమనించాను.

అది పెద్ద వృక్షాన్ని దొలిచి చేసిందే.

నునుపుగా ఉండటం వల్ల తెల్సింది అలా.

పడవ తట్టు (డెక్) చెక్క ముక్కలతో అస్తవ్యస్తంగా, ఎత్తు పల్లాలుగా ఉంది. తట్టు మీంచి అంతర్భాగంలోకి కొయ్య మెట్లున్నాయ్.

శాన్యోరా అందాన్ని ఆటవికులంతా విచిత్రంగా చూస్తున్నారు.

"మీరెలా వచ్చారు?" సైగలతో అడిగాడు నాయకుడు.

వృద్ధనాయకుడికి వచ్చిన ఇంగ్లీషు ముక్కలు చాల తక్కువని అప్పుడు నాకర్థమయింది.

నా చరిత్ర అంతా చెప్పడం కష్టం.

చెప్పినా నాయకునికి అర్థంకాదు.

షిప్ మునిగి ప్రాణరక్షణకోసం ఆ చిన్నబోటులో బయలుదేరినట్లు సైగలతో చెప్పాను.

"మీరంతా ఎక్కడికి బయలుదేరారు?" నాయకుణ్ణి అడిగాను.

నాయకుడు ఓ చురకత్తి తీసుకొని ఓ చెక్కమీద ఏదో గీయసాగాడు.

"భయంకర్! అది తిమింగలం బొమ్మ" అంది శాన్యోరా ఆశ్చర్యంగా.

నాయకుడు వెనక్కి తగ్గి ఓ ఈటె రివ్వున విసిరాడు.

అది వెళ్ళి తిమింగలం బొమ్మ కడుపులో నాటుకుంది.

నాకు విషయం అర్థమైంది. ఆటవికులు 'తిమింగలాల వేట'కి బయలుదేరారు.

అదే విషయం శాన్యోరాకి చెప్పాను.

"ఫాంటాస్టిక్ అనిపిస్తోంది భయంకర్! తిమింగలాల్ని ఈటెలతో చంపడం..."

"అలా అనకు శాన్యోరా! తగలవలసిన చోట తగిలితే ఎంత పెద్ద ప్రాణి అయినా చస్తుంది. వీళ్ళు ఆ విషయంలో బాగా అనుభవజ్ఞులై ఉండాలి."

"ప్రమాదం కదూ! మింగెయ్యదూ?" అన్నట్టు సైగలు చేసాను నాయకుడికి.

నాయకుడు నవ్వాడు.

వెనకాల నిలబడ్డ ఆటవికుల్లోంచి ఒకడ్ని ముందుకు లాగాడు.

అతనివేపు సూటిగా చూశాను.

అతనికి కాలు లేదు!

"తిమింగలం పట్టుకుపోయింది" అన్నాడు నాయకుడు, బొమ్మను చూపించి నోటిని గాలిలో తెరుస్తూ.

"తిమింగలాన్ని చంపడం ఎందుకు?" శాన్యోరా అడిగింది సైగల్తో.

నాయకుడు బొమ్మవేపు మళ్ళీ కదిలాడు. తల భాగం,

తోకభాగంవైపు చూపించి "తింటానికి" అన్నట్లు సైగలు చేసాడు.

తర్వాత ఆటవికులకేసి తిరిగి ఏదో భాషలో మాట్లాడాడు.

"ఇప్పుడే వేటాడతారా తిమింగలాన్ని?" అడిగాను అర్థమయ్యేట్లు చేతులూపుతూ.

"ఇవ్వాళ దొరకలేదు. రేపు రావాలి. గూడానికి వెళ్ళి పోతున్నాం. మీరు మాతో వస్తారు." అంటూ సైగలు చేసాడు నాయకుడు.

శాన్యోరా ఖరీదైన దుస్తుల్ని వింతగా చూస్తూ నిలబడుతున్న ఆటవికుల్ని పెద్ద కేకతో అదిలించాడు నాయకుడు.

వాళ్లు బిత్తరపోయి వెనక్కి తగ్గారు.

శాన్యోరా కది బాధ అనిపించింది.

గబగబా, సామగ్రిలోంచి టేప్‌రికార్డర్ తీసిందామె.

"మీరందరూ పాడండి." అంది వాళ్ళకేసి తిరిగి.

ఆటవికుల కామె మాటలు అర్థం కాలేదు.

నేను నవ్వుతూ "అయ్ లవ్ శాన్యోరా!" అంటూ పాడాను.

వాళ్ళ కర్థం అయి ఉండాలి.

కేరింతలు కొడుతూ 'కెవాలో... కెవాలో..." అంటూ పాట పాడసాగారు.

పాట పూర్తయిం తర్వాత శాన్యోరా నోటిమీద వ్రేలు పెట్టి మౌనంగా ఉండమని వాళ్ళందరికీ చెప్పింది.

ఆమె చేతులు టేప్‌రికార్డర్ మీద కదిలాయి.

ఆటవికులు టేప్‌రికార్డర్ కేసి భయంగా చూడసాగారు.

చటుక్కున ఆక్సిలేటర్ బలంగా నొక్కి. కారు స్పీడు ంచాడు. అరవై మైళ్ళ వేగంతో పోతూంది కారు.

పిటీ లిమిట్స్ దాటి వచ్చేశాడు. వెనక పోలీస్ జీపు లాగే వస్తూంది. అప్పారావుకు ఆకలి వేస్తోంది ఇక నక్కి తిరిగి పోదామా అనుకున్నాడు. అంతలోనే ఏదో రు చెడిపోయి దారికడ్డంగా నిలబడివుంది. కారు ఆపి, గాపీగా సిగరెట్ వెల్గించి, క్రిందకు దిగి నిలబడ్డాడు. అంతలో పోలీస్ జీపు వచ్చి వెనకగా ఆగింది.

"ఏయ్! మిస్టర్! నీ పేరేమిటి?" అడిగాడు ఇన్స్పెక్టర్ గర్జిస్తూ.

అప్పారావు అతనివైపు కోపంగా చూచి, "ది గ్రేట్ డిటెక్టివ్ అప్పారావ్" అన్నాడు గర్వంగా.

"ఆ సంగతి తర్వాత చూద్దాం. ముందు స్టేషన్‌కు నడు!" గర్జించాడు.

"ఎందుకు?" అడిగాడు అప్పారావు కోపంగా.

"ఎందుకా? కారు దొంగతనం చేసినందుకు!" అన్నాడు ఇన్స్పెక్టర్ వ్యంగ్యంగా.

"వాట్? కారు దొంగతనమా! ఇది నా కారే. కావాలంటే చెక్ చేసుకో!" చిన్నగా నవ్వుతూ కారువైపు చూచి తెల్లబోయాడు అప్పారావు.

అది తన కారు కాదు. రంగు ఒకటే. కారు కూడ అంటాపిడరే. కాని నెంబరు మాత్రం వేరు. తన కారు నెంబరు APN 6439. దీని నెంబరు APN 6379.

తను చేసిన పొరపాటు ఎక్కడో అర్థం అయింది అప్పారావుకు. హోటల్లోంచి తీవిగా ఆలోచిస్తూ వచ్చి, తన కారు బదులు ఇంకో కారు ఎక్కాడు అందుకే అక్కడ

కలకలం విన్పించింది.

తెల్లమొహం వేసాడు దిగ్రేట్ డిటెక్టివ్ అప్పారావు

—ఎల్. రామగోపాల్, నెల్లూరు

## భారతీయులకు ఆహ్వానం!!

విదేశంలో వున్న భారతీయులు కొందరు "సత్యశీలా సాంస్కృతిక సంస్థ" నొకదాన్ని స్థాపించుకొన్నారు. సర్దార్‌జీ నొకర్ని ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నారు.

ప్రథమ వార్షికోత్సవం ఘనంగా చేసుకోవాలనుకున్నారు. అక్కడ వున్న భారతీయులందరినీ ఆహ్వానించే బాధ్యత సంస్థ ప్రెసిడెంట్ ఐన సర్దార్‌జీ పైన పడింది.

సర్దార్‌జీ ఆ రోజు ఉదయమే ఒక పుస్తకము చదివారు. ప్రపంచ జనాభాలో ప్రతి ఐదుగురిలో ఒక భారతీయుడు అని. సర్దార్‌జీ తన ప్లాట్‌నుండి బయ వచ్చి, రోడ్డుమీద పోతున్నవాళ్ళను ఒకటీ, రెండూ అం ఆరుదాకా లెక్కించి, ప్రతి ఏడవ వ్యక్తికి ఆహ్వాన పత్రం ఇచ్చాడు.

## "శ్రీకృష్ణ తత్త్వమ్ము"

తెలుగు లెక్చరర్ 'శ్రీకృష్ణ తత్త్వము' గురించి విశదంగా చెప్పి, స్టూడెంట్‌ను ఒక ప్రశ్న అడిగాడు.

"చిన్నికృష్ణుడు జలకమాడుతున్న గోపికల వస్త్రాలు అపహరించాడు. ఎందుకూ?"

ఆ కుర్రాడు లేచి, "ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భంలో ఇవ్వడానికి పనికివస్తాయని" జవాబిచ్చాడు.

—మారుపాక మంజురాణి, హైద్రాబాద్-44.



